Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 7 • 18-2-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-







# సుడిగాలిలో చిక్కిన సర్కారు నావ!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డిని చూసిన వారంతా అయ్యో పాపం అని జాలి పడుతున్నారు. ఎంతో పుణ్యం చేసుకొంటే తప్ప దక్కని అత్యున్నత పదవి ముఖ్యమంత్రిత్వం. కానీ గత జన్మలో ఏదో పాపం చేసి ఆ గద్దె ఎక్కినట్లున్నాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. అందరికీ అమృతం వంటి ఆ పదవి ఆయన పాలిట కాలకూట విషం వలె మారుతున్నది. ఒక్కరోజు ప్రశాంతత లేదు. ఒక్క రాత్రి నిద్ర లేదు. ఒక్క విరామం లేదు. ఒక్క నిముషం భరోసా లేదు. ప్రతి రోజూ దిగులు కూడే. ప్రతి అడుగులోనూ భయమే. ఎన్ని సమస్యలు? ఎన్ని చిక్కు

కొరవ 14వ పేజీలో

# ప్రజా విజయం

హోస్నీ ముబారక్ నిరంకుశ పాలన నుంచి తమను తాము విముక్తి చేసుకోవడానికి ఈజిప్ట్ ప్రజలు చూపిన సాహసం, సంయమనం చరిత్రాత్మకమైనవి. ఎంత గొప్ప నియంత అయినా ప్రజాభిప్రాయం ప్రతికూలమైతే తోక ముడవక తప్పదని మరొకసారి నిరూపించింది ఈ పరిణామం.

ఆఫ్రికా ఖండం పశ్చిమ దిశ కొసన వుండే ఈజిప్టుకు భౌగోళికంగా చాలా ప్రాధాన్యత వుంది. ఆసియా, ఆఫ్రికా ఖండాలను కలిపే వారధి అది. ఆఫ్రికా ఖండంలో అత్యంత అధిక జనాభా కల్గిన దేశం. అరబ్ ప్రపంచంలో అభ్యుదయ భావాలు కల్గిన జాతి. ఆర్థికంగా ఎంతో అభివృద్ధి జరిగింది అక్కడ. ప్రజల జీవన ప్రమాణాలు చాలా మెరుగ్గా వుంటాయి. ప్రపంచంలోకెల్లా పొడవైన నైలు నది ఈజిప్టును సస్య శ్యామలంగా భాసిల్ల చేస్తున్నది. మధ్యధరా, ఎర్ర సముద్రాలను కలుపుతూ నిర్మించిన సూయిజ్ కాలువ ఈ దేశం పరిధిలోనే వుంది. ఆఫ్రికా, అమెరికా ఖండాల నుంచి ఆసియా దేశాలకు నౌక రవాణా ఈ కాలువ ద్వారానే సాగాలి. మరొక దారి లేదు. ఇజ్రాయిల్, లిబియా దేశాలు ఈజిప్టు సరిహద్దులలోనే వున్నాయి. అందువల్ల అరబ్‌లకు, యూదులకు తరతరాలుగా జరుగుతున్న మతపరమైన పోరాటాలకు ఈజిప్టు ప్రధాన సాక్షి.

ముప్పయ్యేళ్ల క్రితం అన్వర్ సాదత్ హత్యతో ఏర్పడిన రాజకీయ కల్లోలంలో అధికారాన్ని చేజిక్కించుకొన్న హోస్నీ ముబారక్ అటు అమెరికా, ఇజ్రాయిల్ దేశాలను ఇటు అరబ్ రాజ్యాలను సమన్వయం చేసుకొంటూ ఎంతో తెలివిగా పాలించాడు. అయితే దేశ వ్యవహారాలలో ఆయన నిరంకుశుడు. ప్రజలకు కనీస పౌరహక్కులు కల్పించలేదు. మరొకప్రక్క అవినీతి విషవ్యాధి ఆయన్ను ఆవహించింది. ఈజిప్టు ఖజానాను దోచుకొని విదేశీ బ్యాంకులలో ఆయన దాచిన సొత్తు విలువ ఏడు లక్షల కోట్ల రూపాయల వరకు వుంటుందని అంచనా వేస్తున్నారంటే, ఈజిప్టు పాలిట ఆయన ఎంతటి భయంకర చెదపురుగో అర్థం చేసుకోవచ్చు. ఎన్నో ఏళ్లపాటు ఈ నిరంకుశ, అవినీతికర పాలనను సహించిన ఈజిప్టు ప్రజానీకం ఓర్పు కోల్పోయి తిరుగుబాటు చేసింది. అయితే వారు తతిమా ఆఫ్రికా దేశస్తుల వలె తుపాకులు చేత పట్టలేదు. ముబారక్ దిగిపోవాలనే కోరికతో లక్షల సంఖ్యలో ప్రజానీకం వీధులలోకి వచ్చి నినాదాలు చేశారు. రోజుల తరబడి పాలకుల చెవులు పగిలిపోయేట్లుగా ఆ నినాదాలను ధ్వనింపచేశారు. ఆ అలికిడికి ముబారక్ పునాదులు కదిలిపోయాయి. పోలీసు బలగాలు ప్రయోగించి వీధులలో గుమికూడిన వారిని తరిమివేయాలని, సైన్యాన్ని ఉపయోగించి తుపాకులతో బెదరించాలని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ప్రజలు తుపాకులకు తమ గుండెలు ఎదురు నిలిపి 18 రోజులపాటు అదే నినాదం విన్పించారు. చివరలో సైన్యం కూడా ప్రజలకు సంఘీభావం ప్రకటించింది. దానితో ముబారక్ దేశం విడిచి పారిపోయాడు. ఈజిప్టు దేశంలో ప్రజాస్వామ్య పవనాలు మలయ మారుతాల వలె ప్రసరించాయి.

ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ దేశాలలో వలె అమెరికా ఇక్కడ జోక్యం చేసుకోలేదు. తతిమా అరబ్ రాజ్యాలు తల దూర్చలేదు. ఆఫ్రికా తిరుగుబాటు సేనలకు ప్రవేశం దొరకలేదు. రక్తపాత రహితంగా, కేవలం రెండున్నర వారంలో ఒక దేశాన్ని నియంతల చెర నుంచి విడిపించిన ధీశాలురుగా ఈజిప్టు ప్రజలు చరిత్రలో చిరస్మరణీయమైన స్థానం అలంకరించారు. మొత్తం ప్రపంచానికే మార్గదర్శకంగా నిలిచారు. ఈ ప్రేరణతో ఇప్పుడు అరబ్ రాజ్యాలన్నిటిలో ప్రజా ఉద్యమాలు మొలకెత్తుతున్నాయి. సౌదీ అరేబియా, యెమెన్, జోర్డాన్, పాలస్తీనా, లిబియా, అల్జీరియా, మొరాకో, కువైట్ తదితర దేశాలన్నిటిలో ప్రజలు తమతమ పాలకుల మీద తిరుగుబాట్లు మొదలుపెట్టారు. టునీషియాలో ఇప్పటికే తిరుగుబాటు విజయం సాధించింది. ఇవన్నీ అరబ్ రాజ్యాలు కావడం గమనార్హం.

ఈజిప్టు ప్రేరణ అరబ్ ప్రపంచానికి పరిమితం కావడం లేదు. మొత్తం ప్రపంచంలో దీనిపై ఆసక్తి రేకెత్తుతున్నది. ప్రజాకంటకులను వదిలించుకోవడం ఇంత సులభమా అన్న ఆశ్చర్యంతో అన్ని దేశాల ప్రజలు తమ తమ పరిధులలో ఈజిప్టు తరహా ఉద్యమాలు జరపాలని ప్రయత్నిస్తున్నారు. మన తెలంగాణ కెసిఆర్ కూడా అదే మాట చెప్తున్నాడంటే, దీని ప్రభావం ఎంత ప్రగాఢంగా వ్యాపించిందో అర్థం చేసుకోవచ్చు. ఇంత కాలం స్వరాజ్య సాధనకు మహాత్మాగాంధీ ఆదర్శంగా నిలుస్తూ వచ్చాడు. ఇప్పుడు ఈజిప్టు సాధారణ ప్రజానీకం ఆయన సరసన చేరింది. నిజమైన ప్రజావిజయం అంటే ఇదే. గొప్ప చరిత్ర సృష్టించిన ఈజిప్టు ప్రజలను మనసారా అభినందిస్తున్నాము.

జమీన్‌రైతు

# జనవాణి

## చిరంజీవి తప్పు చేశారు!

2008 ఆగస్టులో లక్షలాది అభిమానుల సమక్షంలో పలు సామాజిక అంశాలు అజెండాగా ప్రకటించిన ప్రజారాజ్యం పార్టీని చిరంజీవి తీసుకెళ్లి కాంగ్రెస్ పార్టీలో విలీనం చేయడం బాధాకరం. చిరంజీవికి జనంలో ఆదరణ వుంది. ఆయన అనుకొన్న ఆశయాలు సాధించడం కోసం ఐదేళ్లు కూడా వేచిచూసే ఓపిక లేకపోవడం శోచనీయం. చిరంజీవికి ఆశయసాధన, స్వేచ్ఛ, ఆదరణ తన స్వంతపార్టీ కంటే కాంగ్రెస్‌లో లభిస్తుందా? ఇప్పటికే కాకలు తీరిన కాపు నాయకులున్న కాంగ్రెస్ పార్టీలో సున్నిత మనస్కుడైన చిరంజీవి నెగ్గుకరాగలడా? కేవలం ఆరు శాతం ఓటు బ్యాంకు గల కమ్యూనిస్టు పార్టీలు రాష్ట్రంలో మనుగడ సాగిస్తుంటే 17శాతం ఓట్లను పొందిన చిరంజీవి తన పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేసి చరిత్రహీనుడయ్యాడు.

సి.హెచ్.హనుమంతరావు, నెల్లూరు

## అమెరికన్ ఆస్పత్రి ఆస్తులు నిలపాలి!

నెల్లూరు, ప్రకాశం జిల్లా ప్రజలకు అమెరికన్ ఆసుపత్రి అందించిన సేవలు వెలకట్టలేనివి. డాక్టర్ బేర్ నిస్వార్థంగా పనిచేసి ఈ ఆసుపత్రి ప్రతిష్ట పెంచారు. ఆమె అమెరికా వెళ్లిపోయాక ఈ ఆసుపత్రి భ్రష్టుపట్టింది. చివరకు రియల్ ఎస్టేట్ వ్యాపారుల పరమయ్యిందని 'జమీన్‌రైతు'లో చదవి మనసు కలచి వేసింది. గతంలో ఈ ఆసుపత్రి అభివృద్ధికి ఇతోధికంగా సహాయపడిన ఎమ్పీ నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి జోక్యం చేసుకొంటే ఇక్కడి పరిస్థితుల్లో మార్పు వస్తుందని ఆశిస్తున్నాను.

వి.వీరాంజనేయులు, పొదలకూరు

## నోరు అదుపులో లేని కేసీఆర్!

తెలంగాణ రాష్ట్ర సమితి సర్వాధినేత చంద్రశేఖర్‌రావుకు నోరు అదుపులో లేకుండా పోతుంది. ఆంధ్రుల బిర్యాని పేడలా వుంటుందని, ఆంధ్రులు నరరూప రాక్షసులని ఏవేవో మాట్లాడుతున్నాడు. నోరు అదుపులో లేనివాడు పరువు పోగొట్టుకోవడం ఖాయం. కారు కూతలతో కష్టాలు తప్పవు.

ప్రొఫెసర్ కె.ఎన్.రావు, కావలి

## ఉర్దూ టీచర్లను నియమించాలి!

ప్రధాన మంత్రి 15 సూత్రాల పథకం ప్రకారం ఏదైనా ప్రభుత్వ పాఠశాలల్లో 25 శాతంకు మించి ఉర్దూ మాట్లాడే పిల్లలుంటే ఆ పాఠశాలలో ఉర్దూ టీచర్‌ను నియమించాలి. జిల్లాలోని పలు పాఠశాలల్లో ఈ నిష్పత్తిలో పిల్లలున్నా ఉర్దూ టీచర్లను నియమించలేదు. ఏడాది క్రితం ఉర్దూను టిటిసిలో చదివిన 200

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

21-2-1941
పేజీలు : 12 వెల: అణా

### గెలిటీ గారికి గాంధీగారి మాట

"గెలిటీ గారి వ్యాఖ్యానాలు మాన నష్టం దావాకు ఆస్కారం కల్గింపచేసేవే ఐనప్పటికీ సత్యాగ్రహులు అసలు చేయకూడదు. గెలిటీగారు మన ఉద్యమమునకు చెరుపు కల్గచేయ జాలరు. తమ ఉద్యోగానికే కళంకం తెచ్చుకున్నారు" అని గూడూరు కాంగ్రెస్ వాది పి.నారాయణ గారికి ఇచ్చిన ప్రత్యుత్తరంలో గాంధీజీ వ్రాశారు. గెలిటీ గారి కేసుల తీర్పుల వివరములు నారాయణగారు లేఖ ద్వారా గాంధీజీకి వ్రాసియుండిరి.

### నెల్లూరు ముచ్చట్లు
### మునిసిపాలిటీ

రివిజన్‌లో పన్నులు విపరీతంగా పెంచారని కమిషనర్ను తూర్పారబడుతున్నారు ప్రజలు. రెడ్డి గారు! మూన్నాళ్ల ముచ్చటకు అన్‌పాపులరెందుకవుతావు. అదేమిటో విచారించి న్యాయం చేయండి!

మరో మాట మున్సిపాలిటీ మురికినీళ్లు తెచ్చి బృందావనంలో కాల్వ గట్టున గుమ్మరిస్తున్నందున ఆ దుర్గంధానికి చుట్టుప్రక్కల వారు నిల్వలేకున్నామంటున్నారు. అసలే డ్రయినేజి లేక మురికి కూపం అనుభవించే ఆ బృందావనానికే ఈ దౌర్భాగ్యం కూడా ఎందుకు? మరెక్కడన్నా దూరంగా వేయించరాదా?

### హెల్తు క్రిష్టారావు

నెల్లూరు టౌన్ హెల్త్ ఇన్స్‌పెక్టర్ క్రిష్టారావు గారు హిట్లరు అమ్మ మొగుడుగా సంచరిస్తున్నాడు. ఎక్కడ చూచినా ఆయన గూర్చిన కంప్లెయింట్లే వినబడుతుంటవి. ఈ మధ్య కలరా తగిలిందని రాత్రి పూట వీరివద్ద కెళితే తెల్లవారి చూస్తాం పొమ్మన్నారట. ఆ రోగిని తెల్లవారి హాస్పిటల్‌కు చేరిస్తే ఆలస్యమైనదన్నారట హాస్పిటల్ వాండ్లు. పాపం ఆ రోగి చనిపోయాడు. ఇనుప గుండెకాయ గల పట్టాభి! వీరి మీద ఏం చర్య తీసుకున్నావ్?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

170-2-1961
పేజీలు: 12 వెల: 0–20 న.పై

### మంత్రి ద్వయం దిగ్విజయ యాత్ర

294 రోజుల తర్వాత ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య, పబ్లిక్ వర్క్సు శాఖామాత్యుడు అల్లూరు సత్యనారాయణ రాజు గారలు నెల్లూరు జిల్లాలో రెండవసారి దిగ్విజయయాత్ర జేశారు. అఖండమైన సన్మానాలు, సభలు, ఉత్సాహభరితమైన దృశ్యాలు అనుభవించారు, తిలకించారు, ఆనందించారు.

అయితే ఆనాటి పరిస్థితులు వేరు; ఈనాటి వాతావరణం వేరు. ఆనాటి ఆధిపత్యం ఏ.సి.సుబ్బారెడ్డి గారిది; ఏ.సి మంత్రి అయ్యాడనే సహజ ఆనందాతిశయాలు ఆనాటి ఉత్సవాలకు మేళవించినవి. ఈనాటి ఆధ్వర్యంలో వంగల్లు కోదండరామిరెడ్డి గారిది; సుబ్బారెడ్డి గారి సుదీర్ఘమైన అధికార వ్యాపకకారణంగా పేరుకున్న వ్యతిరేకత ఈనాటి సత్కారాలకు సంఘటిత శక్తియై నిలచింది. అయితే కారణం ఏదైనా, ఆధ్వర్యం ఎవ్వరిదైనా వీటి సత్ఫలితాలను పొందినవారు మాత్రం ఆనాడు ఈనాడు కూడా ఒక్కరే. సంజీవయ్య, సత్యనారాయణరాజు గావడం గమనార్హం.

### కనుపూరు కాల్వకు కార్యరూపం

కనుపూరు కాల్వకు మాఘబహుళ చతుర్దశి మంగళవారం(14వ తేది) ఉదయం 9–05 గంటలకు ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య మంత్రోక్తంగా శంకుస్థాపన గావించారు.

ఈ కార్యక్రమం సంగం వద్ద పెన్నకు దక్షణపు ఒడ్డున విజయవంతంగా జరిగింది. రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖ సలహాదారు పద్మభూషణులు వెంకట కృష్ణయ్యర్, పి.డబ్ల్యుడి స్పెషల్ చీఫ్ ఇంజనీరు వెంకట్రామన్, సూపరింటెండింగు ఇంజనీరు బషీర్ అహమ్మద్; తిక్కవరపు రామరెడ్డి ప్రభుత్వ మండల ప్రముఖులు; కనుపూరు కాల్వ రైతు ముఖ్యులనేక మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## కంచి స్వామి రాక

కంచి కామకోటి పీఠాధిపతి స్వామి జయేంద్ర సరస్వతి 21వ తేది నెల్లూరు వస్తున్నారు. కోడూరుపాడులోని గంగా పార్వతి సమేత నీలకంఠేశ్వర స్వామి ఆలయ రాజగోపుర కుంభాభిషేక కార్యక్రమంలో ఆయన పాల్గొంటారు.

## యాక్సిడెంట్ జోన్‌లో ముఖ ద్వారం!

నెల్లూరు కార్పొరేషన్ నూతన కార్యాలయం ముఖ ద్వారాన్ని పొదలకూరు రోడ్డులో ఇప్పటివరకు పలు యాక్సిడెంట్లు జరిగిన చోటే ఏర్పాటు చేయబోతున్నారు. కలెక్టర్ బంగ్లా, బారా షహీద్ దర్గాల మధ్య రోడ్డు కాస్త వంకర తిరిగి వుంటుంది. ఎదురుగా వచ్చే వాహనాలు కనపడని ఈ ప్రాంతంలోనే ముఖద్వారం, దాన్ని ఆనుకొని 40 అడుగుల రోడ్డు వచ్చేట్లు మన మునిసిపల్ ఇంజనీర్లు సర్వం సిద్ధం చేసేశారు.

## శాంతినగర్ దగ్గర వెసలుబాటు

నెల్లూరు మద్రాస్ బస్టాండ్ నుంచి మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం వరకు ట్రంకురోడ్డులో కట్టిన డివైడర్‌ను అర్థీసి బస్టాండు వద్ద మాత్రమే క్రాస్ చేసే వసతి గత రెండేళ్లుగా వుంది. ఏమయ్యిందో ఏమోగానీ ఐదారు రోజుల క్రితం శాంతినగర్‌లో దెబ్బతిన్న రోడ్డును మరమ్మత్తులు చేస్తూ ఈ ప్రాంతంలో రోడ్డు క్రాసింగ్ చేసే వసతి ఏర్పాటు చేయడంతో ప్రజలు సంతోషిస్తున్నారు. పొగతోట కూడలిలో కూడా ఈ పని చేస్తే బాగుంటేదేమో?

## శాంభవికి ఆలయ మర్యాదలా?

గత జన్మానుబంధం భావనలో వార్తలలో నిలుస్తుండిన చిన్నారి బాలిక శాంభవి 15వ తేది పెంచలకోనకు విచ్చేసింది. ఈ బాలికకు ఆలయ మర్యాదలతో స్వాగతం పలికి వివాదానికి తెర తీశారు దేవాదాయ ధర్మాదాయ శాఖాధికారులు.



## రెండు మెరైన్ పోలీస్‌స్టేషన్లు!

సముద్ర తీరప్రాంతాలైన శ్రీహరి కోట, ఇస్కపల్లిలో మెరైన్ పోలీస్‌స్టేషన్ల ఏర్పాటుకు ప్రభుత్వం అనుమతిచ్చింది. ఇప్పటికే జిల్లాలోని దుగరాజపట్నంలో ఓ మెరైన్ పోలీస్‌స్టేషన్ నడుస్తుంది. కొత్త వాటితో కలిపి జిల్లాలో మూడు మెరైన్ పోలీస్‌స్టేషన్లు అవుతాయి.

## ఫ్లెమింగో ఫెస్టివల్ లేనట్లే!

15, 16 తేదీల్లో సూళ్లూరుపేటలో నిర్వహించతలపెట్టిన ఫ్లెమింగో ఫెస్టివల్ వాయిదా పడింది. ఎమ్మెల్సీ ఎన్నికల నేపథ్యంలో కోడ్ అడ్డురావడంతో ఈ పక్షుల పండుగను ఆపివేయక తప్పలేదు. ఈ యేడాది ఈ పండుగ చేసే మూడ్‌లో జిల్లా అధికారులు లేరు.

## లిటిల్ ఏంజెల్స్ విద్యార్థుల సాయం!

నెల్లూరు మూలపేటలోని లిటిల్ ఏంజెల్స్ స్కూల్ విద్యార్థులు నగరంలో విశ్వనేత్ర అంధుల పాఠశాలకు 50వేల రూపాయల విరాళాన్ని 14వ తేది అందజేశారు. ఈ కార్యక్రమంలో స్కూల్ కరస్పాండెంట్ చాట్ల నరసింహారావు, ఆయన కుమారుడు రాజేష్, హెడ్మాస్టర్ లలితాదేవి, బర్నాబాసు తదితరులు పాల్గొన్నారు.

## చాలా రోజులకు చర్య

గత ఏడాది ఏప్రెల్ నెలలో నెల్లూరు ట్రెజరీ వద్ద డ్యూటీ నిర్వహిస్తూ తుపాకిని పోగొట్టిన ఇద్దరు ఏఆర్ కానిస్టేబుళ్లు బి.ప్రసన్నకుమార్, పి.శ్రీనివాసులను డిస్మిస్ చేస్తూ ఎస్పీ దామోదర్ ఉత్తర్వులు జారీ చేశారు. మరో కానిస్టేబుల్ రవీంద్రబాబు జీతానికి మినిమం స్కేల్ విధిస్తూ ఆదేశాలు జారీ చేశారు. తుపాకీ చోరీకి డ్యూటీలో వున్న కానిస్టేబుళ్ల అజాగ్రత్తే కారణమని విచారణలో తేలింది.

## ఈదూరు సుబ్బయ్య స్మారక అవార్డు!

కవి, రచయిత, చిత్రకారుడు, మధుమేహ డాక్టర్ కూడా అయిన డాక్టర్ ఈదూరు సుధాకర్ తన తండ్రి సుబ్బయ్య స్మారకంగా ఏర్పాటుచేసిన సాహితీ పురస్కారాన్ని 12వ తేది టౌన్‌హాల్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో హైదరాబాద్ కవి కందుకూరి శ్రీరాములుకు అందజేశారు. ఈ అవార్డు ఎంపికకు రాష్ట్ర స్థాయిలో కవితల పోటీలు నిర్వహించారు. జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, డాక్టర్ శ్రీనివాసతేజ, పాతూరి అన్నపూర్ణ, డాక్టర్ జయప్రద తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## మాట పుస్తకావిష్కరణ

మంచి కలం, బలం గల రచయిత చిన్ని నారాయణ రావు రచించిన మాట దీర్ఘ కవిత పుస్తకావిష్కరణ నెల్లూరు టిఎవిఎస్ కళ్యాణ్‌సదన్‌లో 13వ తేది జరిగింది. సభలో సినీ కవి వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్ మాట్లాడుతూ సమస్యను, సందర్భాన్ని కవిత్వీకరించడమే గొప్ప అనుభూతి అన్నారు. డాక్టర్ కాళిదాసు పురుషోత్తం, డాక్టర్ బీరం సుందరరావు, గురుబ్రహ్మం, కళాంజలి అనంత్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో పలువురు కవులు పాల్గొన్నారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, వి.ఆర్.కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

జీవిత చందా రూ.1000/-

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-


**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190


## నెల్లూరుకు ఓఎస్‌డి పోస్టు

జిల్లా పోలీసు శాఖకు ఓఎస్‌డి (ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ)గా డివిఎస్ఎన్‌మూర్తి నియమితులయ్యారు. మావోయిస్టుల ప్రాధాన్యం వున్న జిల్లాలలో గతంలో ఓఎస్‌డిలు వుండేవారు. నెల్లూరుకు ఈ కొత్త పోస్టును ఎందుకిచ్చారో? ఏఎస్పీ పోస్టు చాలా రోజులుగా ఖాళీగా వుంది. దాన్నెప్పుడు భర్తీ చేస్తారో తెలియడమే లేదు.




వాకర్స్ ఇంటర్నేషనల్ సంస్థ డిస్ట్రిక్ట్ గవర్నర్‌గా ప్రమాణస్వీకారం చేసిన దేవరాల సుబ్రహ్మణ్య యాదవ్‌ను సన్మానిస్తున్న వాకర్స్ అసోసియేషన్ సభ్యులు.

## సత్యానంద మహర్షి శతజయంతి ఉత్సవాలు

ఇనమడుగులోని సత్యానంద ఆశ్రమంలో స్వామి శత జయంతి ఉత్సవాలు ఫిబ్రవరి 27న మొదలై మార్చి 2వ తేది వరకు జరుగుతాయి. స్వామీజీలు బ్రహ్మానందతీర్థ, శ్రీహరితీర్థ, పురుషోత్తమ బ్రహ్మచారి ప్రత్యేక పూజలు, ధ్యానం, గీతాపారాయణం, రుద్రమహాయజ్ఞం కార్యక్రమాలు చేపడుతారు. భక్తులను ఈ కార్యక్రమాలకు తరలి రమ్మంటున్నారు.

## డిఆర్వోగా పెంచలరెడ్డి

జిల్లావాసి, అన్ని పార్టీల రాజకీయ నాయకులకు ముఖ్యుడు, లౌక్యుడైన సి.హెచ్.పెంచలరెడ్డి జిల్లా రెవిన్యూ అధికారిగా నియమితులయ్యారు. జిల్లాలోని పలు మండలాల్లో ఎమ్మార్వోగా, జడ్పీ సిఇఓగా పనిచేసిన అనుభవముంది. శాసన మండలి ఎన్నికల ఓట్ల లెక్కింపు పూర్తయ్యాక బాధ్యతలు స్వీకరిస్తారు.

## కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి సాయం

పీకల్లోతు ఆర్థిక ఇబ్బందుల్లో వున్న కోవూరు షుగర్ ఫ్యాక్టరీకి రాష్ట్ర ప్రభుత్వం 25 కోట్ల రూపాయలను మంజూరు చేసింది. ఈ వారంలో జరిగిన మంత్రివర్గ సమావేశంలో ఈ మేరకు నిర్ణయం తీసుకున్నారు.

## సుమలతారెడ్డి క్లినిక్‌లో ఆధునిక వైద్యం!

నెల్లూరు పొగతోటలోని సుమ స్కిన్ అండ్ లేజర్ క్లినిక్‌లో అవాంఛిత రోమాలను తొలగించేందుకు అత్యాధునిక పరికరం లైట్ షీర్ లేజర్ అందుబాటులో వుందని డాక్టర్ సుమలతారెడ్డి చెప్పారు. ఈ పరికరం మహిళా మణులకు గొప్పవరమన్నారు. పెద్ద పెద్ద నగరాలకే పరిమితమైన ఈ లేజర్ చికిత్సను నెల్లూరులో మొట్టమొదటి సారిగా తమ క్లినిక్‌లో అందుబాటులో వుంచామని, మహిళలు ఎటువంటి సైడు ఎఫెక్ట్‌ల భయం లేకుండా ఈ చికిత్సను పొందవచ్చున్నారు.

## ఖజానాపై తొలగని ఆంక్షలు

జిల్లాలోని ఖజానా కార్యాలయాలపై ప్రభుత్వం విధించిన ఆంక్షలు ఇంకా తొలగించలేదు. జీతభత్యాలు మినహా మరే బిల్లులు ఖజానాలో చెల్లింపులు చేయడం లేదు.

## ప్రసన్న మిస్సింగ్

కోవూరు నియోజకవర్గ రైతులు స్థానిక శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్న

కొరవ 14వ పేజీలో


ఎవరు దొంగలు?

● రెండున్నర కిలోల

# బంగారం గుటకాయ స్వాహా!

గ్రాము బంగారం 1850 రూపాయలపైమాటే. సవర బంగారపు వస్తువు చేయించాలంటే ఇరవై వేల రూపాయలకు పైగా వెచ్చించాల్సిన రోజులివి. పుత్తడికి మహా డిమాండ్ వున్న ఈ రోజుల్లో నెల్లూరు పోలీసులు ఉత్రవుడియంగా రెండున్నర కిలోల బంగారాన్ని హాంఫట్ చేశారన్న విషయం ఆలస్యంగా తెలియవచ్చింది. జనవరి 20వ తేది విజయవాడకు వెళ్లొస్తుండిన సతీష్‌జైన్‌ను ములుమూడి బస్టాండ్ వద్ద అడ్డగించిన దుండగులు ఆయనపై కత్తితో దాడిచేసి మూడున్నర కిలోల బంగారం, రెండున్నర లక్షల నగదు పట్టుకెళ్లినట్లు పోలీసులు మీడియాకు రెండు రోజులు ఆలస్యంగా తెలియజేశారు. ఈ వార్త ఒకే ఒక దినపత్రికలో మాత్రమే ప్రచురితమైంది. వాస్తవానికి సతీష్‌జైన్‌పై దాడిచేసి దుండగులు దోచుకెళ్లిన బంగారం ఏడు కిలోలట. కానీ దొంగతనానికి పాల్పడింది ఘరానా దొంగలు కాకపోవడంతో వీరంతా మరుసటి రోజే దొరికిపోయారు. పోలీ

### బరి తెగించిన నెల్లూరు పోలీసులు

సులు మాత్రం ఆలీబాబా అరడజను దొంగల ఆట ఆడారు. ఈ దొంగతనంలో సంతపేటకు చెందిన యువకుల హస్తం కూడా వుండడంతో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి జోక్యం చేసుకొన్నారు. ఈ సాకుతో పోలీసుల పంట పండింది. జైన్‌ను అదిరించి బెదిరించి పోయిన బంగారం తక్కువని రిపోర్ట్ ఇప్పించారు. ఇన్‌కంటాక్స్ అధికారులు ఇతర దాడులేమైనా చేస్తారన్న నేపథ్యంలో అతను తలవంచక తప్పలేదు. దీంతో తక్షణం స్వాధీనం చేసుకొన్న బంగారాన్ని అన్నిస్థాయిల పోలీసు అధికారులు తలా కొంత పంచుకొన్నట్లు తెలిసింది. ఆకర్షించేలా వుండిన చేతి వంకీల విషయమై డిఎస్పీ, క్రైం సిఐల మధ్య కాస్త లడాయి కూడా జరిగిందట. ఏదైతేనేం పోలీసులు ఇటు రికవరీ పేరిట భారీ ఎత్తున బంగారం, దానికి తోడు దీన్ని పట్టుకొన్నందుకు ప్రభుత్వ రివార్డులు అందుకోనున్నారు. బాగుంది కదూ నెల్లూరు పోలీసుల వరుస...


ఒంగోలులో జరిగిన కార్యక్రమంలో టిడిపి ఎమ్మెల్సీ అభ్యర్థి దేశాయిశెట్టి హనుమంతరావును పరిచయం చేస్తున్న టిడిపి అధినేత చంద్రబాబునాయుడు.

● పోటీలో గట్టి అభ్యర్థులు

# ముమ్మరంగా ఎమ్మెల్సీ ఎన్నికల ప్రచారం

చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం జిల్లాల ఉపాధ్యాయ, పట్టభద్రుల నియోజకవర్గాలకు సంబంధించిన ఎన్నికల షెడ్యూల్ ఖరారైంది. రాష్ట్ర ఎన్నికల సంఘం ఈ ఎన్నికలు జరిగే తేదీలను విడుదల చేయడంతోపాటు నోటిఫికేషన్ వెలువరించింది. దీని ప్రకారం మార్చి 13న ఎన్నికలు, 15వ తేదీన ఓట్ల లెక్కింపు జరుగుతాయి. ఎన్నికల నగారా మ్రోగడంతో నిన్నమొన్నటి వరకు ఒక మోస్తరుగా సాగుతుండిన అభ్యర్థుల ప్రచారపర్వం ఉధృతమైంది. హేమాహేమీలు పోటీచేస్తున్న ఈ ఎన్నికల్లో ఎవరికివారు గెలుపే లక్ష్యంగా తమ సత్తా చాటేందుకు ముమ్మరంగా నిమగ్నమై వున్నారు. ఇప్పటివరకు 14 మంది అభ్యర్థులు పోటీచేసేందుకు ముందుకు వచ్చి తమ ప్రచారాన్ని కొనసాగిస్తున్నారు. ఉపాధ్యాయ, పట్టభద్రుల నియోజకవర్గ ఎమ్మెల్సీలుగా వున్న విఠపు బాలసుబ్రహ్మణ్యం, దాచూరి రామిరెడ్డి పదవీకాలం మార్చి నెలాఖరుకు ముగియనుంది. దాంతో ఎన్నికల సంఘం ఈ స్థానాలు భర్తీచేసేందుకు ఫిబ్రవరి 11న షెడ్యూల్ జారీ చేసింది. ఈ దఫా ఎన్నికల బరిలో పలువురు ప్రముఖులు నిలబడి వున్నారు. ఉపాధ్యాయ నియోజక వర్గం నుంచి విఠపు బాలసుబ్రహ్మణ్యం రెండోసారి పోటీ చేస్తుండగా, యుటిఎఫ్ అండతో శ్రీనివాసులురెడ్డి పట్టభద్రుల స్థానం నుంచి పోటీలో వున్నారు. తెలుగుదేశం పార్టీ బలపరచిన ప్రముఖ న్యాయవాది దేశాయిశెట్టి హనుమంతరావు పట్టభద్రుల నియోజకవర్గం నుంచి పోటీ చేస్తున్నారు. అలాగే ప్రముఖ సాహితీవేత్త తోట పురుషోత్తం, ప్రముఖ సైకాలజిస్టు వి.వి.సుధాకర్ రెడ్డి, టీచర్స్ గిల్డ్ తరపున సుబ్బారెడ్డి, ఎపిటిఎఫ్ అభ్యర్థిగా కృష్ణయ్య, అపస్ తరపున సురేంద్రరాజు పోటీలో వున్నారు. వివిధ టీచర్ల, డిఇటి, పిఇటి, ప్రిన్సిపాళ్ల సంఘం మద్దతుతో ప్రముఖ రచయిత సాకం నాగరాజు బరిలో నిలుస్తున్నారు. రెండు నియోజకవర్గాల ఎన్నికల కోసం మూడు జిల్లాల్లో మొత్తం 552 పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారు. అభ్యర్థులు రెండు నెలల ముందు నుంచే విస్తృత ప్రచారం చేస్తుండడంతో ఎన్నికల పోరు రసవత్తరంగా మారింది.


ఆనం సోదరులు అవినీతికి పాల్పడ్డారంటున్న సిపిఎం నేత మాదాల వెంకటేశ్వర్లు.

❖ మాజీ డిప్యూటీ మేయర్ మాదాల ఆరోపణ

# అభివృద్ధి కాదు అంతా అవినీతే!

నగరంలో అభివృద్ధి కార్యక్రమాల నెపంతో జరుగుతున్న కార్యక్రమాలలో భారీస్థాయిలో అవినీతి అక్రమాలు చోటుచేసుకొంటున్న విషయం తెలిసిందే. ఆనం సోదరులు తమ అనుచరులకు, సన్నిహితులకు కేటాయించిన పనుల్లో అవినీతి అధికంగా వుంటుందని పలుమార్లు రోడ్ల నిర్మాణాలు ఇతరత్రా కార్యకలాపాల్లో వెల్లడైంది. ఈ పరిస్థితుల్లో నగరంలోని టిబి ఆస్పత్రి ఆవరణలో నిర్మిస్తున్న కార్పొరేషన్ నూతన భవనం పనుల్లో భారీ అవినీతి జరిగిందని, దీనిపై పూర్తిస్థాయి విచారణ జరిపించాలని ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం, సిపిఎం పార్టీలు డిమాండ్ చేస్తున్నాయి. కార్పొరేషన్ బిల్డింగ్ పనులు, చేపల మార్కెట్, చిల్డ్రన్స్ పార్కు రోడ్డు పనుల్లో కోట్ల రూపాయల అవినీతి జరిగిందని సిపిఎం నగర కార్యదర్శి, మాజీ డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు ఆరోపించారు. రెండు కోట్లతో ప్రారంభమైన పనులకు అంచనాలను పెంచి 15 కోట్ల రూపాయలు అదనంగా మంజూరు చేయించి ఆ మొత్తాన్ని ఆనం సోదరులు దిగమింగారన్నారు. ఇంత పెద్ద మొత్తంతో కాంట్రాక్టు పనులు చేపట్టినా ఒకే కాంట్రాక్టర్‌కు అప్పజెప్పడంలో ఆంతర్యం ఏమిటన్నారు. నగర ఎమ్మెల్యే సోదరుడు కాబట్టేనా అని ప్రశ్నించారు. చేపల మార్కెట్ అభివృద్ధి పేరుతో మత్స్యశాఖ నుంచి కోటి ఇరవై ఐదు లక్షలు మంజూరు చేయించి నిధులు స్వాహా చేశారని, చిల్డ్రన్స్ పార్కు రోడ్డు నిర్మాణంలోనూ అవకతవకలు జరిగాయన్నారు. ఆక్రమణ పేరుతో పేదల గుడిసెలు తొలగించి ఆనం సోదరులకు చెందిన రైసుమిల్లును మాత్రం వదలి పెట్టారన్నారు. అధికార దాహంతో ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్న ఆనం సోదరుల అక్రమాలపై విజిలెన్సు విచారణ జరిపించాలని డిమాండ్ చేశారు.

# అవినీతి నిరూపిస్తే ప్రాణత్యాగం


తనపై వచ్చిన ఆరోపణలు అర్థరహితమంటున్న జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

జడ్పీ ఐదేళ్ల పాలనలో తాను అవినీతికి పాల్పడినట్లు చిన్న ఆధారమైనా నిరూపిస్తే ప్రాణత్యాగానికి సిద్ధమని జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ప్రకటించారు. అధికారంలో వున్న కొందరు పనిగట్టుకొని బురద చల్లేందుకు జడ్పీపై అవినీతి ఆరోపణలు చేస్తున్నారని ఆరోపించారు. గత కొన్ని రోజులుగా జిల్లా పరిషత్ నూతన భవన నిర్మాణం నిలిపివేసే యత్నం, కార్యాలయాలపై ఎసిబి దాడులు తదితర పరిణామాల నేపథ్యంలో తన ప్రతిస్పందన తెలియజేసేందుకు జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో ఫిబ్రవరి 12వ తేది విలేకరుల సమావేశం నిర్వహించారు. తాను ఛైర్మన్‌గా పదవీ బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి నీతి నిజాయితీలతో ఎక్కడా అవినీతికి ఆస్కారం లేకుండా పనిచేశానన్నారు. తాటాకు చప్పుళ్లకు తాను బెదిరేది లేదని అవసరమైతే సిబిఐ విచారణకైనా తాను సిద్ధమని ప్రకటించారు. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న కాలంలో జడ్పీ భవన నిర్మాణానికి కోటి రూపాయలు ఇవ్వగా, ఇసుక మాఫియాను కట్టడిచేసి ప్రభుత్వానికి జమచేసిన నిధుల నుంచి కొంత మొత్తాన్ని వెచ్చించి ఏడు కోట్ల రూపాయలతో భవనాన్ని నిర్మిస్తుంటే దానికి కుటిలయత్నంతో అడ్డుకోవాలని చూడడం సిగ్గు చేటన్నారు. నిర్ణీత సమయానికి భవన నిర్మాణాన్ని పూర్తిచేసే చావ, శక్తి తనకున్నాయని స్పష్టం చేశారు. తనపై కక్షతో జిల్లాలోని ఉద్యోగులను ఇబ్బంది పెట్టడం బాధ కల్గిస్తోందన్నారు. అవసరమైతే ఉద్యోగుల సంక్షేమం కోసం నిర్మాణ పనులు ఆపటానికైనా సిద్ధమన్నారు. పంచాయితీ రాజ్ ఎస్ఇ తన పరిధులు దాటి ప్రవర్తించారని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పిన కాకాణి ప్రజల అభీష్టం మేరకే జగన్ వెంట నడుస్తున్నానన్నారు. ఈ సమావేశంలో వైస్ ఛైర్మన్ రాజా, జడ్పీటిసి సభ్యులు చిరంజీవి రెడ్డి, నాగేశ్వరరావు, పాండురంగ యాదవ్ తదితరులు పాల్గొన్నారు.


నార్త్ టెక్సాస్‌లో జరిగిన తెలుగు అసోసియేషన్ కార్యక్రమంలో పాల్గొని వారి పురస్కారాన్ని అందుకొన్న నెల్లూరు హాస్యనటుడు దోర్నాల హరిబాబు, మిమిక్రీ కళాకారుడు రవి.


నెల్లూరు రూరల్ మండలం పెద్ద చెరుకూరు గ్రామంలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో మహిళలకు చెక్కులిస్తున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

# రచ్చబండపై పరిష్కారాలేవి?

**జనవరి 24తేది నుంచి ఫిబ్రవరి 12తేదీ వరకు జిల్లాలో జరిగిన రచ్చబండ కార్యక్రమం ఒక ప్రహసనంలా సాగింది. దీనిలో మంత్రులు, ఎమ్మెల్యేలు, అధికారులు పాల్గొన్నా ప్రజా సమస్యలు పరిష్కరించే దిశగా చర్యలు తీసుకోలేకపోయారు.**

రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా నిర్వహించిన రచ్చబండ కార్యక్రమం ఏ సమస్యకు పరిష్కారమార్గం చూపలేక పోయింది. దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. ఆయన మరణానంతరం ఒకటిన్నర సంవత్సరం తర్వాత ప్రస్తుత ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఈ కార్యక్రమాన్ని తిరిగి నిర్వహించాలని నిర్ణయించారు. దీంతో జనవరి 24వ తేది నుంచి ఫిబ్రవరి 12వ తేది వరకు రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో రచ్చబండ కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమం జరిగిన తీరు, ఇందులో పాల్గొన్న మంత్రులు, ఎమ్మెల్యేలు, అధికారులు ఏ మాత్రం ప్రజా సమస్యలను పరిష్కరించే దిశగా చర్యలు తీసుకోలేక పోయారు.

గ్రామీణ ప్రాంతాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిధులతో అమలు చేస్తున్న సంక్షేమ, అభివృద్ధి కార్యక్రమాలను పరిశీలించడంతోపాటు ప్రజలకు వీటి ఫలాలు అందుతున్నాయా? లేదా? అనే విషయాల గురించి అడిగి తెలుసుకోవాలి. జిల్లాలో గ్రామ పంచాయితీలలో నిర్వహించిన రచ్చబండ కార్యక్రమంలో వీటి గురించి అడిగి తెలుసుకొన్న వారు కానరాలేదు. గత ఆరు సంవత్సరాల క్రితం చేపట్టిన కార్యక్రమాల గురించి విడుదల చేసిన నిధుల గురించే అధికార పార్టీకి చెందిన ఎమ్మెల్యేలు ఉపన్యాసాలు గుప్పించారు. ప్రతిపక్ష పార్టీకి చెందిన ఎమ్మెల్యేల నియోజకవర్గాల్లో అధికారులు చేస్తున్న అక్రమాలపై ప్రజలు నిలదీయడం కనిపించింది.

ప్రధానంగా రేషన్‌కార్డులు, ఇళ్ల స్థలాలు, వృద్ధాప్య ఫించన్లు, తాగునీటి సమస్యలపై ప్రజలు అధికారులపై ప్రశ్నల వర్షం కురిపించారు. 2008 సంవత్సరంలో నిర్వహించిన ప్రజాపథం ఎలా జరిగిందో రచ్చబండ కార్యక్రమం కూడా అదే రీతిలో కొనసాగింది. ఈ కార్యక్రమంలో అధికంగా ప్రజలు హాజరవుతారనే ఉద్దేశ్యంతో లేనిపోని ఆశలు కల్పించారు అధికారులు. తీరా కార్యక్రమం వద్దకు వచ్చే సరికి రాజకీయ ఉపన్యాసాలు వినడం, వినతిపత్రాలు సమర్పించేందుకే పరిమితం కావాల్సి వచ్చిందని ప్రజలు విసుగు చెందాల్సి వచ్చింది.

మేజర్ గ్రామ పంచాయితీల పరిధిలో ఎక్కువ గ్రామాలుంటాయి. పంచాయితీ కార్యాలయంలో ఈ కార్యక్రమం ఏర్పాటు చేయడంతో మిగిలిన గ్రామాల ప్రజలు కొందరు హాజరుకాలేక పోయారు. రోజుకు నాలుగు గ్రామ పంచాయితీలలో రచ్చబండ నిర్వహించాల్సి రావడంతో ప్రజల సమస్యలు వినేందుకు ఎక్కువ సమయం కేటాయించలేక పోయారు. స్వయం సహాయక సంఘాలకు బ్యాంకు లింకేజి రుణాలు అందించడం వరకే జిల్లా మంత్రి, జిల్లా కలెక్టర్ పరిమితం కావాల్సి వచ్చింది. జిల్లాలో పది అసెంబ్లీ నియోజకవర్గాలుండగా ఆత్మకూరు నియోజకవర్గంలో నిర్వహించిన రచ్చబండలో మంత్రి ఎక్కువసార్లు పాల్గొన్నారు.

జగన్ పార్టీలో చేరిన ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి నియోజకవర్గం ఇందుకూరుపేట మండలంలో మంత్రి పితాని సత్యనారాయణతో కలసి నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానంద రెడ్డి పాల్గొని ఎమ్మెల్యేపై విమర్శలు గుప్పించారే తప్ప ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను అడిగి తెలుసుకోలేక పోయారు. కొన్ని పంచాయితీలలో గ్రామ సర్పంచ్‌లతో నిమిత్తం లేకుండానే సాగునీటి సంఘాల అధ్యక్షులు రచ్చబండను నిర్వహించడం విశేషం.

## నిధుల ఊసేలేదు

జిల్లాలో 18 రోజులపాటు రచ్చబండ కార్యక్రమం కొనసాగింది. ఈ కార్యక్రమానికి అవసరమైన నిధులను ప్రభుత్వం విడుదల చేస్తున్నట్లు ప్రకటించింది. 2500 కోట్ల రూపాయలు రచ్చబండకు ఖర్చు చేస్తామని ముఖ్యమంత్రి ప్రకటింపచేశారు. అయితే ఇందులో మన జిల్లా వాటాగా ఎన్ని నిధులు విడుదలయ్యాయి? విడుదలైన నిధులను దేనికి ఖర్చు చేశారన్న విషయం అధికారులు వెల్లడించడం లేదు. గ్రామాల్లో ఏర్పాటుచేసిన రచ్చబండకు విఆర్వో, పంచాయితీ కార్యదర్శులు అన్ని ఖర్చులు భరించారు. మొత్తం మీద రచ్చబండ కార్యక్రమం ఏ లక్ష్యం కోసం ఏర్పాటు చేశారో అధికారులకే తెలియాల్సి వుంది.

# తాగునీటి ప్రాజెక్టులు పూర్తయ్యేదెన్నడో?

జిల్లాలో వేసవి సమీపిస్తుంది. ఎండలు తీవ్రమయ్యే అవకాశం కనిపిస్తుంది. దీంతో తాగునీటి సమస్య తలెత్తి ప్రజలు పలు ఇబ్బందులకు గురవుతారు. ప్రతి సంవత్సరం వేసవి కాలంలో తాగునీటి ఎద్దడి ఏర్పడుతున్నా తాత్కాలిక చర్యలు చేపట్టి చేతులు దులుపుకొంటున్నారే తప్ప సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణం పూర్తి చేయలేక పోతున్నారు. ప్రజల తాగునీటి అవసరాలను తీర్చాలన్న వుద్దేశ్యంతో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణం కోసం కోట్ల రూపాయల నిధులు మంజూరు చేసినా అధికారుల నిర్లక్ష్యం, కాంట్రాక్టర్ల వుదాసీనత కారణంగా పూర్తి కాకుండా పోతున్నాయి.

జిల్లాలోని నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలలో తాగునీటి సరఫరా కోసం సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకుల నిర్మాణానికి 2008 సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. నెల్లూరు నగరంలో 125 కోట్లు, కావలి 20 కోట్లు, వెంకటగిరి 70.40 కోట్లు, గూడూరు 64.15 కోట్లతో పనులు చేపట్టడం జరిగింది. నాలుగు మునిసిపాల్టీలలో ఈ పనులు పర్యవేక్షణ, తనిఖీ చేసే బాధ్యతను ప్రజారోగ్య సాంకేతికశాఖకు ప్రభుత్వం అప్పగించింది. పనులు ప్రారంభించడంలో చూపిన ప్రత్యేక శ్రద్ధ పూర్తి చేసే విషయంలో మాత్రం ప్రజాప్రతినిధులుగాని, అధికారులు గాని చూపించలేకపోతున్నారు.

సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు నిర్మాణంతోపాటు తాగునీటి సరఫరాకు సంబంధించిన పైపులైన్లను కూడా ఈ నిధులతోనే పూర్తి చేయాల్సి వుంటుంది. నాలుగు మునిసిపాల్టీలలో పనులు అసంపూర్తిగానే వున్నాయి. నెల్లూరు నగరం చెరువు సమీపంలో నిర్మించిన ట్యాంకు పనులు పూర్తి దశకు చేరుకోకముందే ప్రారంభించేశారు. పైపులైన్ల అనుసంధానం సక్రమంగా చేయకపోవడంతో లీకేజీలు జరుగుతున్నాయి. నేటికి సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకు పనులు జరుగుతూనే వున్నాయి. మునిసిపాల్టీ ప్రాంతాల్లో తాగునీటి సరఫరా సక్రమంగా కాకపోవడంతో ప్రజలు తీవ్ర ఇక్కట్లు పడుతున్నారు. తాగునీటి ఎద్దడి ఏర్పడే విషయం అధికారులకు ముందే సమాచారం వుంటుంది.

సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు నిర్మాణ పనులను పర్యవేక్షించేందుకు ఒక ఎస్ఇ, ముగ్గురు డిఇలు ఇతర సిబ్బంది వున్నారు. రాజకీయ ఒత్తిళ్ల నేపథ్యంలో నిర్మాణ పనులు పూర్తి చేయించలేక పోతున్నారన్న విమర్శలు ఎదుర్కొంటున్నారు. మరోప్రక్క ఈ శాఖ పరిధిలో నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాలను కూడా చేర్చారు. ఈ శాఖలో విధులు నిర్వహిస్తున్న అధికారులు, సిబ్బంది అవినీతి, అక్రమాలకు పాల్పడుతున్న కారణంగా కాంట్రాక్టర్లు పనులు పూర్తి చేయలేక పోతున్నారన్న వాదన వినిపిస్తుంది. తాగునీటి నివారణ కోసం ప్రభుత్వం కోట్ల


నిర్మాణంలో వున్న నెల్లూరు సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్.

రూపాయలు ఖర్చు చేస్తున్నా ఆశించిన ఫలితాలు రావడం లేదు.

తాగునీటి సమస్య పట్టిపీడిస్తున్నా నివారణ చర్యలు మాత్రం తూతూమంత్రంగానే వుంటున్నాయి. తాగునీటి ప్రాజెక్టు పనులు పూర్తయితే సంపాదన వుండదన్న కారణంతో అధికారులు కాలయాపన చేస్తున్నారు. ప్రాజెక్టు నిర్మాణం కోసం విధించిన గడువు ఎప్పుడో తీరిపోయింది. ఇప్పటికైనా ప్రజాప్రతినిధులు, సంబంధిత శాఖ అధికారులు స్పందించి తాగునీటి ప్రాజెక్టులను పూర్తి చేసి ప్రజల అవసరాలను తీర్చాల్సిన అవసరం వుంది.

# కాట్రాయపాడులో భూ వివాదాలు!

## పరిష్కారాలు వెతకాలి

దగదర్తి మండలం కాట్రాయపాడు భూముల పంపిణీ వివాదం నెలకొంది. గ్రామంలోని 187 ఎకరాలు సర్వే నెంబర్ 207 ప్రకారం గల భూమిని లబ్ధి దారులకు పంపిణీ చేయడంపై గత కొనేళ్లుగా నెలకొన్న వివాదం సమసిపోలేదు. 2009లో ఈ భూమిని పేదలకు పంచేందుకు అసైన్‌మెంట్ కమిటి ఆమోదం తెలిపింది. మొదట్లో ఈ భూమి అటవీ భూమిగా నమోదై వుండడంతో పేదలకు అందజేసేందుకు సాంకేతిక సమస్య ఏర్పడడంతో అప్పుడు కావలి ఎమ్మెల్యేగా వున్న మాగుంట పార్వతమ్మ కృషిచేసి అటవీశాఖ పరిధి నుంచి ఆ భూములను మినహాయించేలా చేసి లబ్దిదారులకు అందించేందుకు మార్గం సుగమం చేసింది. భూపంపిణీ జరిగే సమయానికి రెండు వర్గాలుగా చీలిపోవడం ఒకరిపై నొకరు విమర్శలకు, ఆరోపణలకు దిగడంతో, భూపంపిణీ నిలిచిపోయింది. అసైన్‌మెంట్ జాబితాలో 60మంది స్థానికులు వున్నారని ఒక వర్గం, కాదని మరోవర్గం ఒకరిపై ఒకరు దూషణకు దిగడంతో ఇటీవల వివాదం పెద్దదైంది. పెద్దలు, అధికారులు జోక్యం చేసుకొని ఈ వివాదాన్ని చక్కదిద్ది లబ్దిదారులకు భూములను అందజేయాలని పలువురు కోరుకొంటున్నారు.



శాసనమండలి నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాల పట్టభద్రుల స్థానం నుంచి పోటీ చేస్తున్న బిజెపి అభ్యర్థి డాక్టర్ ఎం.వెంకటసుబ్బారెడ్డి నెల్లూరు వాకర్స్ అసోసియేషన్ సభ్యులను కలసి మద్దతు కోరుతున్న దృశ్యం.




అంతర్జాతీయ యువజన దినోత్సవాన్ని పురస్కరించుకొని రామచంద్రా మిషన్ జాతీయస్థాయిలో నిర్వహించిన వ్యాసరచన పోటీల్లో విజేత నెల్లూరు వేదవ్యాస స్కూల్ విద్యార్థి నితీష్‌ను అభినందిస్తున్న స్కూల్ నిర్వాహకుడు గిరి.

● ఆత్మకూరులో

# వరుస మారిన రాజకీయం!

ఆత్మకూరు నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీకి చెందిన మాజీ ఎమ్మెల్యే కంచర్ల శ్రీహరినాయుడు ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి విందు ఏర్పాటు చేయడం చర్చనీయాంశమయ్యింది. కంచర్ల స్వగ్రామమైన నారంపేట రచ్చబండ కార్యక్రమానికి మంత్రి ఆనం హాజరయ్యారు. రాజకీయంగా వీరిరువురు వేరు వేరు పార్టీల్లో వున్న పరిస్థితుల్లో రామనారాయణరెడ్డికి శ్రీహరినాయుడు విందు ఇవ్వడం నియోజకవర్గంలో చర్చకు తెరలేపింది. చిన్న గ్రామమైన నారంపేటలో కంచర్ల అధికంగా ఖర్చు చేసి కిలోమీటరు దూరం వరకు స్వాగతం చెపుతూ ఫ్లెక్సులు కట్టించడమే కాక బాణాసంచా, మేళతాళాలతో హడావిడి చేశారు. అనంతరం

## ఆనంకు కంచర్ల విందు

జరిగిన రచ్చబండ కార్యక్రమంలో మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడుపై కంచర్ల విరుచుకపడ్డారు. కావాలని కక్షబూని తన గ్రామంలో రోడ్డు వేయకుండా చేశాడని ఆరోపించారు. పొత్తుల కారణంగా 1999 ఎన్నికల్లో బిజెపి అభ్యర్థిగా పోటీ చేసిన బొల్లినేని కృష్ణయ్యకు అనుకూలంగా వ్యవహరించానన్నారు. దీనిపై కక్షబూనిన కొమ్మి తన స్వగ్రామమైన నారంపేట రోడ్డు మంజూరు కాకుండా అడ్డుపడ్డారన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని తమ గ్రామానికి తారురోడ్డు వేయించాలని మంత్రిని కోరారు. ఈ కార్యక్రమంలో ఎంఎల్‌సి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి, శ్రీహరినాయుడు కుమార్తె నెల్లూరులో మాజీ కార్పొరేటర్ యాలమూరి ఉషారాణి, రైస్‌మిల్లర్స్ అసోసియేషన్ నాయకుడు రంగయ్యనాయుడు తదితరులు పాల్గొన్నారు.

● చిత్తలూరు

# ఆరోగ్య కేంద్రానికి జబ్బు చేసింది!

## డాక్టర్, నర్సులు లేరు.

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న ఆత్మకూరు నియోజకవర్గం చేజర్ల మండలంలోని చిత్తలూరు ప్రాథమిక ఆరోగ్యకేంద్రం పరిస్థితి అధ్వాన్నంగా వుంది. డిస్పెన్సరీగా వున్న దీని స్థాయిని పెంచి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంగా మార్చినప్పటికీ సౌకర్యాలు మెరుగుపడలేదు. స్థాయి పెరిగిందే గాని వైద్యసేవలు నానాటికి దిగజారిపోతున్నాయి. ఇక్కడ పనిచేస్తున్న డాక్టర్ ఉన్నత చదువుల పేరుతో వెళ్లి ఆరునెలలవుతోంది. నర్సులు ఇద్దరు పదోన్నతిపై వెళ్లారు. కీలకమైన డాక్టర్, నర్సింగ్ సిబ్బంది లేకపోవడంతో ప్రజలకు వైద్యసేవలందించే వారే లేకుండా పోయారు. దీనికి తోడు పిహెచ్‌సి పరిధిలో గల 10 ఆరోగ్య ఉపకేంద్రాలలో ఏటూరివారి కండ్రిగ, వావిలేరు, నెర్నూరు, తూర్పు కంభంపాడు సెంటర్లను నాలుగింటిని దీనికి కలిపారు. పల్స్‌పోలియో కార్యక్రమం నాడు సైతం ఆరోగ్య కేంద్రం తలుపులు తెరచేవారే లేకుండా పోయారు. జిల్లా అధికారులు స్పందించి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని వైద్యసేవలు అందించేలా తగిన వైద్యసిబ్బందిని నియమించాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

# సంక్షేమ పథకాలు అందేలా చూస్తాం!

అర్హులైన ప్రతి ఒక్కరికి సంక్షేమ పథకాలు అందించేందుకు కృషి చేస్తున్నట్లు జిల్లా కలెక్టర్ రాంగోపాల్ స్పష్టం చేశారు. అల్లూరు మండలం ఇస్కపల్లిలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ తెల్లరేషన్ కార్డు వున్నందువల్ల ప్రతి ఒక్కరూ లబ్దిపొందవచ్చన్నారు. ఇందిరమ్మ గృహాలు, వృద్ధాప్య పింఛన్లు, ఆరోగ్యశ్రీ తదితర పథకాలన్నీ తెల్లకార్డు ద్వారా పొందే వీలుంటుందన్నారు. రాష్ట్రంలో అమలవుతున్న ఆరోగ్యశ్రీ పథకాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి అమెరికాలోనూ ప్రవేశపెట్టినట్లు తెలిపారు. అల్లూరు మండలంలో క్రొత్తగా 300 రేషన్ కార్డులు ఇచ్చామని, బ్యాంకు

## ఇస్కపల్లి రచ్చబండలో కలెక్టర్ భరోసా

లింకేజి ద్వారా మహిళలకు పావలా వడ్డీకే రుణాలు అందిస్తున్నామని వివరించారు. కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ ఇస్కపల్లి పంచాయితీ పరిధిలో ప్రతి ఒక్కరూ గృహాలను నిర్మించుకోవాలన్నారు. అభివృద్ధి విషయంలో పార్టీలకు అతీతంగా పాల్గొంటామని, పేదరికాన్ని రూపుమాపేందుకు కృషి చేస్తామని తెలిపారు. అనంతరం గ్రామంలో నూతనంగా నిర్మించిన ప్రాథమిక పాఠశాల భవనాన్ని కలెక్టర్ రాంగోపాల్ ప్రారంభించారు. బీద మస్తాన్‌రావు సొంత నిధులతో ఏర్పాటు చేసిన బస్ షెల్టర్‌ను, పంచాయితీ కార్యాలయ భవనానికి, డ్రైన్ల నిర్మాణానికి కలెక్టర్ శంకుస్థాపన చేశారు.

# చెత్త మావూర్లో పోస్తారా?

## ఎమ్మెల్యే బీదను నిలదీసిన రుద్రకోట వాసులు

కావలి పట్టణంలోని చెత్తనంతా తీసుకవచ్చి తమ గ్రామ ముంగిట్లో వేస్తే ఊరుకొనేది లేదని రుద్రకోట గ్రామస్తులు ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావుకు తేల్చి చెప్పారు. ఒక కార్యక్రమంలో పాల్గొనేందుకు గ్రామానికి వచ్చిన ఎమ్మెల్యేని గ్రామస్తులు ఈ విషయంపై నిలదీశారు. 10 కిలోమీటర్ల దూరంలో వున్న కావలి పట్టణంలోని చెత్తను తీసుకొచ్చి మా గ్రామంలో వేయడం ఏమిటని వారు ప్రశ్నించారు. పట్టణ పరిధిలో ఎన్నో ఖాళీ స్థలాలు వుండగా మా గ్రామంలో కంపోస్టుయార్డు ఏర్పాటు చేయాలనుకోవడం తగదన్నారు. దీనిపై వెనక్కు తగ్గేది లేదన్నారు. గ్రామస్తులంతా ఒక్కసారిగా చుట్టుముట్టి చెత్తపై నిలదీయడంతో ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు నిశ్చేష్టుడయ్యాడు. ఆగ్రహంగా వున్న గ్రామస్తులను శాంతింపజేసేందుకు ప్రయత్నించారు. గ్రామస్తులంతా ఏకమై చెత్తను అడ్డుకోవాలని, తాను కూడా మద్దతు తెలుపుతానని హామీ ఇచ్చారు.

# సూళ్లూరుపేటలో తమిళ బియ్యం

● కిలో తొమ్మిది రూపాయలు

రేషన్‌బియ్యం అక్రమ రవాణా గేరు మారింది. జిల్లా నుంచి తమిళనాడు తదితర ప్రాంతాలకు తరలిపోతున్న బియ్యం ఇప్పుడు అక్కడ నుంచి జిల్లా సరిహద్దు ప్రాంతాలకు దిగుమతి అవుతుండడం విశేషం. తమిళనాడులో పేద ప్రజల కోసం తమిళనాడు ప్రభుత్వం అందిస్తున్న రేషన్‌బియ్యం సరిహద్దులు దాటి సూళ్లూరుపేటకు చేరుకొంటుంది. ఈ బియ్యాన్ని అక్రమ వ్యాపారులు చిన్నచిన్న మూటల రూపంలో ఈ ప్రాంతానికి తరలిస్తున్నారట. తమిళనాడులో కిలో రూపాయికి అందజేస్తున్న ఉప్పుడు బియ్యాన్ని సూళ్లూరుపేట ప్రాంతంలో కేజీ తొమ్మిది రూపాయల లెక్కన అమ్ముతున్నట్లు సమాచారం. ఈ బియ్యాన్ని అమ్మే వ్యాపారులు కొందరు ఏకంగా బియ్యాన్ని నిల్వ చేసుకొనేందుకు గోడౌన్లు ఏర్పాటు చేసుకొన్నారట. తమిళనాడులోని ఎన్నూరు, కవరైపేట, గుమ్మిడిపూడి ప్రాంతాల నుంచి సబర్బన్ రైళ్ల ద్వారా ఈ బియ్యం ఇక్కడికి చేరుకొంటున్నాయి. స్థానికంగా వుండే అధికారులు చూసీ చూడనట్లు వ్యవహరిస్తుండడంతో బియ్యం అక్రమ రవాణా యదేచ్ఛగా సాగుతోంది.

# సంగంలో ధాన్యం కొనుగోలు కేంద్రం

సంగం మండలంలో రైతాంగం చాలా కాలంగా కోరుకొంటున్న ధాన్యం కొనుగోలు కేంద్రం ఏర్పాటయింది. రెవెన్యూ కార్యాలయానికి ఎదురుగా గల ప్రభుత్వ గిడ్డంగులలో ఏర్పాటు చేసిన ఈ కేంద్రాన్ని తహశీల్దార్ రేవతి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన రైతు సదస్సులో ఆమె మాట్లాడుతూ ఇక్కడ ధాన్యం కొనుగోలు కేంద్రం ఏర్పాటు చేయడం వలన రైతులకు ఎంతగానో ఉపయోగపడుతుందన్నారు. రైతులు తమ ధాన్యాన్ని అమ్ముకొనే సమయంలో ప్రభుత్వ ధరల ప్రకారమే విక్రయించాలని సూచించారు. రైతులు దళారుల మాటలు నమ్మి మోసపోవద్దని హెచ్చరించారు. ఈ కార్యక్రమంలో వ్యవసాయశాఖ ఎఇ గోపి నాయక్, ఎంపిడిఓ రమణయ్య, పెద్ద సంఖ్యలో రైతులు పాల్గొన్నారు.

# వాళ్లు అభివృద్ధి నిరోధకులు

**తెలుగుదేశం నేతలపై ఆదాల ధ్వజం**

గత తెలుగుదేశ ప్రభుత్వ హయాంలో రాష్ట్ర ప్రజలకు జరిగిన అభివృద్ధి శూన్యమని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి విమర్శించారు. వెంకటాచలం మండలంలో పర్యటించిన ఆదాల తెలుగుదేశం నేతల తీరుపై తనదైన శైలిలో విమర్శలు చేశారు. టిడిపి హయాంలో గ్రామాలకు కొద్దిపాటి పింఛన్లు, తాత్కాలిక అభివృద్ధి తప్ప ఒరిగిందేమీ లేదన్నారు. 2004లో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన నాటి నుంచే ప్రజలందరికి అభివృద్ధి ఫలాలు అందుతున్నాయన్నారు. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచే పేదలకు పలు పథకాలు అందుబాటులోకి వచ్చాయన్నారు. ఆయన చేపట్టిన అభివృద్ధి, సంక్షేమ పథకాలను ప్రస్తుత ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి విజయవంతం చేయడానికి గట్టిగా కృషి చేస్తున్నారని ప్రశంసించారు. తెలుగుదేశం పార్టీ నేతలు అభివృద్ధిని చూడలేక కాంగ్రెస్ పార్టీ వారిపై బురద చల్లే ప్రయత్నం చేస్తున్నారని విమర్శించారు. ఈ సందర్భంగా పలువురు లబ్ధిదారులకు పింఛన్లు, రేషన్‌కార్డులు, పావలావడ్డీ చెక్కులు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులరెడ్డి, ఎన్‌డిసిసిబి ఉపాధ్యక్షుడు వేమారెడ్డి శ్యాంసుందర్‌రెడ్డి, జడ్పీటిసి మాజీసభ్యుడు రవికుమార్ తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరు ఆర్యవైశ్య సీనియర్ సిటిజన్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశంలో ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత వెలిశెట్టి నారాయణరావును సన్మానిస్తున్న కృష్ణయ్య, బి.వి.నరసింహం, ఆచార్య ఆదిత్య తదితరులు.

# అభివృద్ధి చేసి... మళ్లీ పోటీ చేస్తా!

**ఆత్మకూరులో మంత్రి రామనారాయణరెడ్డి**

ఆత్మకూరును అన్ని విధాలా అభివృద్ధి చేసి చూపించేంత వరకు నిద్రపోనని, అలా చేయని పక్షంలో వచ్చే ఎన్నికల్లో ముఖం చూపించనని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి వ్యాఖ్యానించారు. ఆత్మకూరు నియోజకవర్గంలో జరిగిన పలు కార్యక్రమాల్లో పాల్గొన్న మంత్రి తనపై జగన్ వర్గీయులు చేస్తున్న విమర్శలకు తీవ్రంగా స్పందించారు. కొత్తముసుగులు వేసుకొన్న పాత మిత్రులంటూ వారిపై విరుచుకపడ్డారు. అభివృద్ధిని చూడలేని కబోధులని విమర్శించారు. ఆత్మకూరు చేజర్ల మండలాల్ని కలిపే పెన్నావంతెన ఏమన్నా చిన్న పనా వెంటనే పూర్తి కావడానికంటూ మాట్లాడిన మంత్రి దీని నిర్మాణానికి సంబంధించి సర్వే జరుగుతుందన్నారు. తనపై విమర్శలు చేస్తున్న వారు ఎక్కడా ఇమడలేరని, చివరకు నా వద్దకే రావాల్సి వుంటుందన్నారు. ఇన్నాళ్లు ఆత్మకూరును ఎవరూ అభివృద్ధి చేయలేదని, అభివృద్ధికి చర్యలు చేపడుతున్న తనపై కావాలని విమర్శలు చేయడం సహేతుకం కాదన్నారు.



ఎస్‌బిఐ ఆధ్వర్యంలో చదువులో ప్రతిభ కనపరచిన విద్యార్థినులకు కలెక్టర్ రాంగోపాల్ చేతుల మీదుగా చెక్కులను పంపిణీ చేస్తున్న ఎస్‌బిఐ రీజనల్ మేనేజర్ కామేశ్వరరావు.

# అస్థిత్వం కోల్పోయిన వీవర్స్ సొసైటీ!

**వెంకటగిరిలో ఇదీ సంగతి**

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన వెంకటగిరి చేనేతకు ప్రోత్సాహం కొరవడింది. వందల సంవత్సరాల చరిత్ర కల్గిన ఈ ప్రాంత చేనేత పరిశ్రమకు ప్రభుత్వం నుంచి చేయూత లభించడం లేదు. పట్టణంలో వీవర్స్ కోఆపరేటివ్ సొసైటీ 1936లో ఏర్పాటైంది. ఈ సొసైటీలో ఆనాడు వెయ్యి మందికి పైగా సభ్యులుండేవారు. కాలక్రమేణా సొసైటీలోని సభ్యుల సంఖ్య క్షీణించి నేడు వందకు తక్కువగా చేరుకొంది. అలాంటి సొసైటీకి అప్పట్లో విలువైన భవనాలు, స్థానిక చేనేత కార్మికులకు 21ఎకరాల స్థలం కేటాయించారు. అలాంటి సొసైటీ వున్న ఆస్తులను పరిరక్షించుకొని, చేనేతలకు ప్రోత్సాహం అందించాల్సిందిపోయి అస్థిత్వాన్ని కోల్పోవడం విచారకరం. గత పాలకవర్గం సొసైటీ పబ్లిక్‌పర్పస్ స్థలాల్లో అవకతవకలకు పాల్పడడం, నిధుల దుర్వినియోగం ఆరోపణలతో ఆనాటి పాలకవర్గం అధ్యక్షుడు గంగరాజు రాజీనామా చేశాడు. ఆయన స్థానంలో గోవిందయ్య అధ్యక్షుడైనా సొసైటీ ఆస్తులు అన్యాక్రాంతం కాకుండా రక్షించలేకపోయారు. ప్రస్తుతం సొసైటీకి నూతన భవనాలు మంజూరయ్యాయి. ఈ పరిస్థితులలో చేనేత సొసైటీకి పూర్వవైభవం తీసుకొనిరావాలని కార్మికులు కోరుకొంటున్నారు.

# ఆక్రమణల తొలగింపుకు మంత్రి ఆదేశించాలా?

**కావలి మునిసిపల్ అధికారుల విచిత్ర వైఖరి**

కావలి పట్టణంలో మునిసిపల్ స్థలాన్ని ఆక్రమించి నిర్మించిన షాపులను ఎట్టకేలకు అధికారులు తొలగించారు. మాజీ మునిసిపల్ ఛైర్మన్ నగళ్ల శ్రీనివాస కిరణ్ వర్గీయులైన చెన్నమ్మ మనుషులు మునిసిపల్ స్థలంలో రేకుల షెడ్డులు వేసి వ్యాపారాలు సాగిస్తున్నారు. ఈ ఆక్రమణలను తొలగించాలని అప్పటి కమిషనర్ పెంచలయ్య ప్రయత్నించగా ఛైర్మన్ అడ్డుకొన్నారు. ఇది పెద్ద వివాదమైంది. ప్రజాప్రతినిధులు ఛైర్మన్‌కు అండగా నిలవడంతో ఈ తొలగింపు జరుగలేదు. చివరకు కమిషనర్‌ను బదలీ చేయించారు. ఈ పరిస్థితుల్లో మునిసిపల్ పాలకవర్గం పదవికాలం ముగియడం, శ్రీనివాస కిరణ్, ఆయన వర్గీయులు జగన్ వెంట నడవడంతో ఇదే అదనుగా భావించిన కాంగ్రెస్ నేతలు అధికారులకు బాసటగా నిలిచారు. స్థానికులతో మంత్రికి ఫిర్యాదు చేయించారు. ఏకంగా మునిసిపల్ మంత్రి స్పందించి ఆక్రమణల తొలగింపుకు ఆదేశాలు జారీ చేయడంతో తీవ్ర ప్రతిఘటన మధ్య అధికారులు ఈ తొలగింపు చేపట్టారు.

# దొంగలు బాబోయ్ దొంగలు

**కుంభకర్ణ నిద్రలో పోలీసు**

ఉదయగిరి నియోజకవర్గంలో దొంగతనాలు అధికం అయ్యాయి. ఇళ్లలో దొంగలు వరుస చోరీలకు పాల్పడుతూ ప్రజలకు కంటి మీద కునుకు లేకుండా పోయింది. మరోవైపు జనాన్ని కాపాడే దేవుళ్లకు కూడా భద్రత కరువయ్యింది. జలదంకి, వింజమూరులో గల ఆలయాల్లో దొంగలు పడి వస్తువులను తస్కరించారు. అలాగే కావలి నియోజకవర్గంలోనూ దొంగతనాలు అధికం అయ్యాయి. కావలి పట్టణంలోని వెంగళరావు నగర్ శివాలయం, అష్టలక్ష్మి ఆలయం, సంతోషిమాత ఆలయాల్లో హుండీలను పగలగొట్టారు. శివాలయంలో చోరీ జరగడం ఇది రెండవసారి. ఆలయాలు, ఇళ్లలో దొంగతనాలు అధికమైనా పోలీసులు తూతూ మంత్రపు దర్యాప్తులతో సరిపెట్టేస్తున్నారు. తగిన చర్యలు చేపట్టడంలో విఫలం అవుతున్నారు. విచారణ పేరుతో సరిపెట్టడం తప్ప దొంగలను పట్టుకొనేందుకు ఎలాంటి చర్యలు తీసుకోకపోవడంపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

# సూళ్లూరుపేట పాఠశాలకు కొత్తహంగులు!

రూపుకోల్పోయి వున్న సూళ్లూరుపేట ప్రభుత్వ పాఠశాల పూర్వవిద్యార్థుల కృషితో కొత్తహంగులతో అందంగా తయారైంది. ఈ పాఠశాలలో చదివిన పూర్వ విద్యార్థుల్లో ఒకరైన శ్రీహరికోట షార్ కేంద్రం డైరక్టర్ పద్మశ్రీ నారాయణ ఇస్రో మాజీ ఛైర్మన్, రాజ్యసభ సభ్యులు డాక్టర్ కస్తూరి రంగన్‌కు చెప్పి పాతిక లక్షలు విరాళమిప్పించారు. అమెరికాలో వైద్యుడు డాక్టర్ పరంధామరెడ్డి ఐదు లక్షల రూపాయలు విరాళమిచ్చిన ఈ పాఠశాల భవనాన్ని ఎమ్మెల్యే పరసారత్నం ఫిబ్రవరి 7న పునః ప్రారంభించారు. ఆయన మాట్లాడుతూ ప్రాభవం కోల్పోయిన పాఠశాలను లక్షలు వెచ్చించి క్రొత్తగా ముస్తాబు చేయడం హర్షదాయకమన్నారు. పాఠశాల అభివృద్ధికి పాటుపడిన వారు పట్టాభివృద్ధికి సహకరించాలని కోరారు. ఈ విషయంలో పార్టీలకు అతీతంగా ప్రతి ఒక్కరూ కలసి రావాలన్నారు. జిల్లా కేంద్ర సహకార బ్యాంకు ఛైర్మన్ వాకాటి నారాయణరెడ్డి మాట్లాడుతూ ఇలాంటి కార్యక్రమాలకు తనవంతు సహకారం అందిస్తామన్నారు. టిడిపి రాష్ట్ర కార్యదర్శి వేనాటి రామచంద్రారెడ్డి మాట్లాడుతూ పాఠశాల మైదానంలో ఎలాంటి కట్టడాలు నిర్మించకుండా ఎమ్మెల్యే తగిన చర్యలు చేపట్టాలని కోరారు. శ్రీసిటి అధినేత రవి సన్నారెడ్డి, ప్రముఖ పారిశ్రామికవేత్త గంగాప్రసాద్‌లు తమవంతు విరాళంగా చేరో పదిలక్షలు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో సీనియర్ కాంగ్రెస్ నేత బద్దెపూడి వేణుగోపాలరెడ్డి, డాక్టర్ పరంధామిరెడ్డి, డాక్టర్ రామగోపాల్‌రెడ్డి, పూర్వపు విద్యార్థులు పలువురు పాల్గొన్నారు.

**పూర్వవిద్యార్థుల కృషి ఫలితమిది**



# అయోమయంలో ఆదాల

## ● ఆనమోళ్ల ఇంట్లో, జగన్ గూటిలో అటో కాలు... ఇటో కాలు

సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి రాజకీయ గందరగోళంలో చిక్కుకొన్నట్లు కన్పిస్తున్నది. నెల్లూరు జిల్లా కాంగ్రెస్ వాదులందరి వలె ఆయన అయోమయంలో కొట్టుమిట్టాడుతున్నారు. ఎటు నడవాలో, ఏది సరైన దారో అర్థంకాక తికమక పడుతున్నాడు. గత శుక్రవారం ఆయన హఠాత్తుగా జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఇంట్లో దర్శనమిచ్చాడు. పొద్దున్నే సంతపేటకు వెళ్లి, ఉపాహారవిందు ఆరగించి, అక్కడే జరిగిన పత్రికా విలేకరుల సమావేశంలో మంత్రిగారి పక్కన ఆశీనుడైనాడు. గత కొన్నేళ్లుగా వీరిద్దరి మధ్య నడుస్తున్న రాజకీయ పోరు చూస్తున్న వారికి ఈ పరిణామం ఆశ్చర్యం కల్గించింది. ఆదాల ప్రభాకర్‌రెడ్డిని తమ శత్రువుగా చూస్తూ వచ్చారు ఆనం సోదరులు ఇంతకాలం. తెలుగుగంగ కాలువలో ఆయన చేస్తున్న కాంట్రాక్ట్ పనులపై విచారణ జరపాలని, కొన్ని కోట్ల రూపాయల సొమ్ము తిరిగి రాబట్టాలని పబ్లిక్ అకౌంట్స్ కమిటీ సమావేశాలలో పలుమార్లు గట్టిగా పట్టుబట్టాడు ఆనం వివేకానందరెడ్డి. అటువంటి రాజకీయ ప్రత్యర్థుల ఇంట్లో ఆయన దర్శనం ఇవ్వడం ఆశ్చర్యమే కదా?

మరొకప్రక్క, వైఎస్.జగన్ కొత్తగా పెట్టబోయే పార్టీలో చేరమని ప్రభాకర్‌రెడ్డి మీద గట్టి ఒత్తిడి వుంది. ఇంతకాలం ఆ ఒత్తిళ్లకు దూరంగా వున్న ప్రభాకర్‌రెడ్డి మొన్నొకరోజు హఠాత్తుగా వైవి.సుబ్బారెడ్డితో మంతనాలు జరిపినట్లు కలకలం రేగింది. ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ఇంట్లో వీరిద్దరి సమావేశం జరిగినట్లు చెప్తున్నారు. అయితే, ఆ చర్చలు ఒక కొలిక్కి రాలేదన్నది వాస్తవం. రాజకీయ ప్రత్యర్థుల ఇంట్లో ఒక కాలు, జగన్ గూటిలో మరొక కాలు పెట్టడం – తన రాజకీయ భవితవ్యాన్ని నిర్ణయించుకోవడంలో ప్రభాకర్‌రెడ్డి అయోమయ స్థితికి అద్దం పడుతున్నది. జిల్లా కాంగ్రెస్ రాజకీయాలలో రామనారాయణరెడ్డి తిరుగులేని శక్తిగా ఎదిగిన నేపథ్యంలో, వారితో శత్రుత్వం వల్ల సాధించేది ఏదీ లేదన్న నిస్పృహ ఒక వైపు; తానెంత దగ్గరగా వెళ్లినా వారు తనను నమ్మరన్న అనుమానం ఇంకొకవైపు ఆయన్ను సతమతం చేస్తున్నట్లుంది. అందువల్లనే ఆయనలో ఈ తికమక. అయితే ఇంతకాలం ఆయన కోసం ఆనం వారితో యుద్ధం చేసిన అనుచరులు, అభిమానులు మాత్రం, ఆయన బేషరతుగా వారికి లొంగిపోయినట్లు ప్రవర్తించడాన్ని మాత్రం జీర్ణించుకోలేకపోతున్నారు.

# కెవిపి మిస్టరీ

ఆరేళ్లపాటు రాష్ట్ర రాజకీయాలను మకుటంలేని మహారాజు వలె శాసించిన వైఎస్ స్నేహితుడు కెవిపి.రామచంద్రరావు దేశం వదలి పెట్టి, దుబాయిలో ప్రవాస జీవితం గడపడం పెద్ద మిస్టరీగా మారింది. దాదాపు నాలుగు నెలల నుంచి ఆయన భారతదేశం మీద కాలు మోపలేదు. రేపు 21తేది నుంచి జరగబోయే రాజ్యసభ సమావేశాలకు మాత్రం హాజరౌతానని, ఆ వెంటనే దుబాయి వెళ్లిపోతానని, హైదరాబాద్‌కు ఇప్పట్లో వచ్చే ఆలోచన లేదని సన్నిహితులతో చెప్తున్నాడట.

వైఎస్ వున్నంతకాలం రాష్ట్ర ప్రభుత్వం కెవిపి కనుసన్నలలో నడిచింది. ఆయన ఆజ్ఞ లేకుండా చిన్న బదలీ కూడా జరిగేది కాదు. ఆ తర్వాత రోశయ్య కాలంలో కూడా తన హవా చలామణి చేసుకొన్నాడు కెవిపి. అయితే కిరణ్‌కుమార్‌రెడ్డి గద్దె ఎక్కిన పక్క క్షణం నుంచి ఆయనలో వుక్కపోత మొదలైంది. ముఖ్యమంత్రిగా కిరణ్‌కుమార్‌రెడ్డి కెవిపి సలహా మీద ఆధారపడడం లేదు. అయితే కెవిపి వూరు విడిచి వెళ్లిపోవడానికి ఇది కారణం కాదని, వైఎస్ కాలంలో జరిగిన ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి వైఎస్ జగన్‌తో వచ్చిన పేచీల వల్లనే ఆయన ప్రవాస జీవితం ఎంచుకొన్నాడని చెప్తున్నారు. తనతోపాటు తన కుటుంబాన్నంతటినీ దుబాయికి తరలించాడు. ఇక్కడ వుంటే ఏదో కీడు జరుగుతుందనే భయం ఆయనలో కలగడం వల్లనే ఈ ప్రవాస శిక్ష అని పరిశీలకుల వూహ. నిజమెంతో భగవంతుడికెరుక.

## కెకెకు గవర్నర్ గిరి

మాజీ పిసిసి అధ్యక్షుడు, ఏఐసిసి ప్రధాన కార్యదర్శి కె.కేశవరావును గవర్నర్‌గా పంపాలని అధిష్టానం నిర్ణయించినట్లు తెలుస్తున్నది. కొత్తగా పార్టీలో చేరిన ప్రజారాజ్యం అధినేత చిరంజీవిని కేంద్రంలో మంత్రిగా తీసుకోవడానికి ఈ ఏర్పాటు జరుగుతున్నది. కెకె చేత రాజ్యసభ సభ్యత్వానికి రాజీనామా చేయించి, ఆ ఖాళీలో చిరంజీవిని ఎన్నిక చేసి, కేంద్ర మంత్రిత్వం కట్టబెట్టాలన్నది అధిష్టానం అభిమతం. కెకె కూడా అందుకు సమ్మతించినట్లు చెప్తున్నారు. తెలంగాణ విషయంలో కెకె తొందరపాటు మాటలు, చేష్టలు సోనియాగాంధీకి ఆగ్రహం తెప్పించాయి. తెలంగాణ వాదులంతా నోరు మూసుకొని వుండమని ఎన్నిసార్లు చెప్తున్నా, కెకె మాత్రం వీలు దొరికినప్పుడల్లా తెలంగాణ పేరు మీద ఏదో ఒక గొడవ సృష్టిస్తూనే వున్నాడు. సున్నితమైన తెలంగాణ అంశం మీద ఇటు వంటి రాజకీయ జిమ్మిక్కులు ప్రమాదకరమన్నది అధిష్టానం అభిప్రాయం. అందువల్ల ఆయన్ను రాజకీయ కార్యకలాపాలకు దూరంగా పంపేయాలన్న నిర్ణయానికి వచ్చారు. చిరంజీవికి ఒక ఖాళీ సీటు కావాలి కాబట్టి, ఆయన్ను గవర్నర్‌గా పంపితే ఒక్క దెబ్బకు రెండు పిట్టలు రాలుతాయి.

## ట్రంకు రోడ్డు కబుర్లు



### కుంభకర్ణ నిద్రలో శానిటరీ సిబ్బంది

నెల్లూరు పేరుకు కార్పొరేషనే గానీ నగరంలో ప్రజారోగ్య పరిస్థితులు పరమఘోరంగా వున్నాయి. ప్రజారోగ్య శాఖలో పనిచేసే వందలాది మంది సిబ్బంది వారిని నియంత్రించే వ్యక్తులు ముఖ్యమైన ప్రాంతాల్లో రోడ్లు, డ్రైనేజీల శుభ్రం వంటి బాధ్యతలు చూస్తున్నారు. మిగతావాటి విషయం పట్టించుకోవడం లేదు. విద్యాసంస్థలు ఎక్కువగా వుండే హరనాథపురం ప్రాంతంలో డ్రైనేజీలను శుభ్రపరచక పోవడంతో వాటి పొట్టపగలి గబ్బు కొడుతున్నాయి. రామ్మూర్తి నగర్, బాలాజీనగర్‌లలోనూ ఇదే పరిస్థితి. వన్ టౌన్‌లోని జెండావీధిలో డ్రైనేజీల గూర్చి ఎంత తక్కువ చెప్పుకొంటే అంతమంచిది. నెల్లూరు నగరాన్ని సుందర నందనవనం చేస్తామని పదే పదే చెప్పే నేతలు సుందర ముదనష్టాన్ని చేయకుంటే చాలని ప్రజలు వాపోతున్నారు.

### హై... హై... నాయకా!



ప్రజారాజ్యం పార్టీని కాంగ్రెస్ పార్టీలో విలీనం చేయడాన్ని చిరంజీవి అభిమానులు జీర్ణించుకోలేరని సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి తలంచారు. పార్టీ విలీనంపై 10తేది మహేశ్వరి – పరమేశ్వరి కళ్యాణ మండపంలో ఏర్పాటుచేసిన అభిమానుల సదస్సుకు భయంభయంగానే హాజరయ్యారు. విచిత్రంగా చిరంజీవి అభిమానులు ఆయన చేసింది మంచి పనేనని, శ్రీధర కృష్ణారెడ్డి నగరంలో అభివృద్ధి పనులు జరగను వివేకానందరెడ్డితో గతంలో కలిసి తిరగడం తప్పుకాదనడంతో ఆశ్చర్యపోయారు. తనను ఎమ్మెల్యేను చేసిన చిరంజీవి అభిమానుల కోసం ఎప్పుడు ఎక్కడకు రమ్మన్నా వస్తానని, జీవితాంతం రుణపడి వుంటానని భావోద్వేగంతో చెప్పడంతో అభిమానులు వుబ్బిపోయారు.

### నేను మోనార్క్‌ను...



నేను మోనార్క్‌ని... నన్నెవరూ ఏమీ చేయలేరని అదేదో సినిమాలో నటుడు ప్రకాష్‌రాజ్ అన్నట్లు రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పడం చర్చనీయాంశమయ్యింది. రాష్ట్ర ప్రభుత్వంలో 52 శాఖలకు అధిపతిని నేనే. ముఖ్యమంత్రి తర్వాతి స్థానం నాదేనంటూ గతవారం తన నియోజకవర్గంలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో మంత్రి పేర్కొనడం తీవ్ర విమర్శలకు దారితీసింది. ఆర్థికమంత్రి అయ్యాక రామనారాయణరెడ్డిలో వచ్చిన మార్పుకు ఈ మాటలు సంకేతమని ఎసి సెంటర్‌లో గుసగుసలు విన్పిస్తున్నాయి.

### ప్రెస్ పోస్టింగుల్లో నేతలు!




ప్రభుత్వ వుద్యోగాలు, ప్రైవేటు సంస్థలలో కొలువుకోసం రాజకీయ నేతలు సిఫార్సులు చేయడం సహజం. ఫోర్త్ ఎస్టేట్‌గా పిలవబడే జర్నలిజంలోనూ నేతల రెకమెండేషన్లు ప్రధాన పాత్ర పోషించడం మారుతున్న కాలానికి సంకేతంగా నిలుస్తున్నాయి. యువనేత నిర్వహించే దినపత్రికలో పనిచేసే ఎడిషన్ ఇన్‌ఛార్జి, బ్యూరో ఇన్‌ఛార్జ్‌లను అకస్మాత్తుగా బదలీ చేశారు. వీరి స్థానంలో నియమాలకు పడమటి పల్లెల ప్రజానాయకుడు ముఖ్యభూమిక పోషించాడు. స్వకులస్తుడే కావాలని తెలంగాణ జిల్లాల నుంచి ఓ కంట్రిబ్యూటర్‌ను పిలిపించి నియమింపజేశాడు. పత్రికా విలేకరుల నియామకాల్లో ఇటు వంటి ట్విస్ట్‌లు గతంలో లేవని ట్రంకురోడ్డులో పాత్రికేయులు తెగ చర్చించుకొంటున్నారు.

### గబ్బుపట్టిన ఎసిబి!




మిగతా జిల్లాల సంగతి మనకు తెలియదుగానీ, నెల్లూరులో అవినీతి నిరోధక శాఖకు ఒక ప్రతిష్ట వుంది. ఇప్పటివరకు పనిచేసిన అధికారులు తమకు ప్రజల నుంచి వచ్చే ఫిర్యాదుల ఆధారంగా అవినీతిపరులపై దాడి చేసేవారు. రాజకీయ ఒత్తిళ్లను పెద్దగా పట్టించుకొనేవారు కాదు. గతవారం ఎసిబి పూర్తిగా రాజకీయానికి తలొగ్గి నెల్లూరులో నిర్మాణంలో వున్న జిల్లా పరిషత్ కార్యాలయం, పాత కార్యాలయం, ఏడెనిమిది మండల కేంద్రాలలోని మండల పరిషత్ కార్యాలయాలను తనిఖీ హడావుడిగా చేపట్టి రాజకీయ బురదను అంటించుకొంది. ఈ బురదను కడుక్కోను ఎసిబి అధికారులకు చాలా రోజులు పడుతుంది.




## నేదురుమల్లితో చిరు చర్చలు

కొత్తగా కాంగ్రెస్ కండువా వేసుకున్న చిరంజీవి గత ఆది వారం నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డిని కలిసి దాదాపు రెండు గంటలపాటు ఆ మాటా ఈ మాటా మాట్లాడారు. ఏడాది క్రితమే చిరంజీవిని కాంగ్రెస్‌లోకి తేవాలని జనార్ధనరెడ్డి ప్రయత్నించారు. ఈ విషయం అప్పట్లో సోనియాగాంధీ చెవిలో కూడా వేశారట. అయితే అప్పట్లో ఈ ప్రతిపాదన పెండింగ్‌లో పడినా మొత్తానికి జనార్ధనరెడ్డి అనుకున్నట్లు 'చిరు' కాంగ్రెస్‌లోకి వచ్చేశాడు. ఈ విషయాన్ని గుర్తుంచుకొని 'చిరు' మర్యాదపూర్వకంగా జనార్ధనరెడ్డి ఇంటికి వచ్చి మనసువిప్పి మాట్లాడాడు. అనుకోకుండా వచ్చిన అతిథి 'చిరు'కి రాజ్యలక్ష్మమ్మ 'భారీ'గానే అల్పాహార విందు యిచ్చారట. చిరంజీవికి నెల్లూరుతో కూడా సంబంధం వుండటం మాటల్లో పాత అనుభవాల్ని 'చిరు' నెమరవేసుకున్నాడట.

## ఖజానా ఖాళీ – చేతులెత్తేసిన ఆనం!

రాష్ట్ర ఖజానా ఖాళీ అయింది. భారం భరించలేక ఆర్థికమంత్రి ఆనం రామనారాయణ రెడ్డి చేతులెత్తేశాడు. తెలుగుదేశం ప్రభుత్వంలో ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రంగా వుండేది. పలుమార్లు నిధుల కోసం కేంద్ర ప్రభుత్వంపై ఆధారపడాల్సి వచ్చేది. అయితే వై.ఎస్ నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చాక అప్పటి ఆర్థికమంత్రి రోశయ్య ఆచితూచి వ్యవహరించడం వల్ల పరిస్థితి అదుపులో వుండేది. అయితే ప్రజాకర్షణ పేరుతో వై.ఎస్ ప్రవేశ పెట్టిన ఉచిత విద్యుత్, రెండు రూపాయల కిలో బియ్యం, ఆరోగ్యశ్రీ, విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంట్ వంటి పథకాలు ఖజానాపై పెను భారంగా మారాయి. ప్రస్తుతం విద్యార్థుల ఫీజు రాయితీలే మూడున్నరవేల కోట్ల రూపాయలు దాకా పేరుకుపోయి వున్నాయి. మిగతా పథకాల భారం రెండు వేల కోట్ల దాకా వుంది. ఇక ఇతర సంక్షేమ పథకాలకు గత బడ్జెట్‌లో కేటాయించిన మొత్తాన్ని కూడా విడుదల చేయలేని పరిస్థితులు నెలకొని వున్నాయి. దీంతో ఈ యేడాది రాష్ట్ర వార్షికబడ్జెట్ మొత్తాన్ని వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా కుదించాలని ఆర్థికమంత్రి పట్టుబడుతున్నాడు. ఖజానా ఖాళీ అయితే వేస్ అండ్ మీన్స్ కింద కేంద్రం నుంచి అడ్వాన్సు తెచ్చుకునే ప్రమాదం లేకుండా చూడాలన్నది ఆర్థికమంత్రి ఉద్దేశం. అయితే సిఎం మాత్రం వార్షిక కేటాయింపుల మొత్తం లక్షకోట్ల రూపాయలు దాటాల్సిందేనంటూ పట్టుబడుతున్నాడట. ఇలా చేస్తే ఈ ఏడాది ఖజానా పూర్తిగా ఖాళీ కావడం ఖాయం అంటూ ఆర్థికమంత్రి ఆనం చేతులెత్తేస్తున్నాడు.

## ఇక బదలీలు లేనట్లే

రాష్ట్రంలో ముఖ్యమంత్రి మారినప్పుడల్లా పరిపాలనా యంత్రాంగంలో పెద్దఎత్తున బదలీలు జరగడం పరిపాటి. అయితే కిరణ్‌కుమార్‌రెడ్డి మాత్రం నెలలు గడుస్తున్నా ఐఎఎస్‌ల బదలీల జోలికి పోవడం లేదు. దీంతో యేళ్ల తరబడి పాతుకుపోయిన అధికారులు పైలాపచ్చీసుగా వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వశాఖల్లో సమీక్షలు లేవు. సాధారణ సంక్షేమ కార్యక్రమాలు కూడా మూలనబడుతున్నాయి. రాజకీయ అస్థిరతల వల్ల కిరణ్ అధికారుల బదలీల జోలికి పోవడం లేదంటున్నారు. ఈ నెల 17 నుంచి అసెంబ్లీ బడ్జెట్ సమావేశాలు ప్రారంభమైన దృష్ట్యా ఏప్రిల్ మొదటివారం వరకు ఇక ఐఎఎస్‌ల బదలీలు లేనట్లే. సో... ఐఎఎస్‌లకు ఈ రెండు నెలలు ఆటవిడుపే అన్నమాట!!

## ఇదేమి బహిష్కరణ

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కోరుతూ తెలంగాణ ప్రాంత ఉద్యోగులు విధులకు హాజరు కావడం లేదు. దీంతో ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు స్తంభించిపోతున్నాయి. కనీసం సీమాంధ్రకు చెందిన ఉద్యోగులతో అయినా పని చేసుకుందామనుకుంటే తెలంగాణ ఉద్యోగులు ససేమిరా అంటున్నారు. గత కొన్ని రోజులుగా ఉద్యోగుల విధుల బహిష్కరణతో సచివాలయంలోని సెక్షన్లు బోసిపోతున్నాయి. అసలే ఆర్థిక దుస్థితితో సంక్షేమ కార్యక్రమాలు వెనుక బడుతుంటే, ఇప్పుడు విధుల బహిష్కరణతో ప్రభుత్వమే స్తంభించిపోయే పరిస్థితి ఏర్పడుతోంది. ఈ నేపథ్యంలో ఈ నెల నుంచి ప్రారంభంకానున్న శాసనసభ బడ్జెట్ సమావేశాల సంగతేమిటో అర్థంగాక శాసనసభ అధికారులు తలలు పట్టుకుంటున్నారు. అసెంబ్లీ సిబ్బందిలో ఎక్కువమంది తెలంగాణ ప్రాంత ఉద్యోగులు వుండటంతో సభను ఎలా నడపాలంటూ డిప్యూటి స్పీకర్ నాదెండ్ల మనోహర్ మొత్తుకుంటున్నాడు. ఉద్యోగాల్ని బహిష్కరించిన ఉద్యోగులకు ఈ నెల జీతాలు యిస్తారో లేదో ఇంత వరకు ప్రభుత్వపరంగా నిర్ణయం తీసుకోలేదు. విధులకు రాకపోయినా జీతాల్ని మాత్రం చెల్లించాల్సిందేనంటూ ఉద్యోగులు కోరుతున్నారు... చూద్దాం! ఏం జరుగుతుందో!!

# వారఫలాలు

*తేది 19-2-2011 నుండి 25-2-2011 వరకు కుంభంలో రవి, బుధ, కుజులు; ధనుస్సులో శుక్ర, రాహువులు; మీనంలో గురువు; కన్యలో శని; మిథునంలో కేతువు; సింహ, కన్య, తులావృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




నూతన వస్త్రాభరణాలు కొంటారు. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. బయటవారి కోసం ఖర్చు చేస్తారు. ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులకు అత్యంత చక్కని కాలం. దైవ కార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి.




ఇల్లుమార్పిడి, స్థలమార్పిడుల గురించి చింతిస్తారు. ఇంటికి సంబంధించి దుబారా ఖర్చు చేస్తారు. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధమార్గాల ధనప్రాప్తి. అనుకూల వాతావరణం. సోదరుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలలో పురోభివృద్ధి బాగుంటుంది. చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి. వృథా వాదాలకు దిగవద్దు.




విందు వినోదాలలో ముఖ్యపాత్ర వహిస్తారు. చాలకాలంగా ప్రయత్నిస్తూ వచ్చిన పనులు ఈనాడు ఫలోన్ముఖమవుతాయి. పురప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం ఉంటుంది. విశ్రాంతి తక్కువ. జాయింటు వ్యవహారాలు చక్క దిద్దుకొంటాయి. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి.




భగవదారాధన వైపు మనసు పోనిస్తారు. పురోభివృద్ధికి సహాయ సహకారాలందించే వారితో మైత్రి ఏర్పడుతుంది. సంతాన కారణంగా మనశ్చింత. మిత్రులతో కలసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపారవిస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. వృత్తి ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పులు చేర్పులు జరిగే సూచనలు. బంధువుల మూలంగా చిరు ఖర్చులు. ఆరోగ్యం చక్కగా ఉంటుంది.




పైవారితో అభిప్రాయభేదాలున్నా బయటపడనీయవద్దు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. మార్పులు, చేర్పులు, కూర్పులు జరుగవచ్చు. ఓపిక అవసరం. బాధాదాయకమైన ఊహలకు గురికావద్దు. వివాహాది శుభకార్యప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.




ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మిత్రులమూలంగా మేలు. ధన విషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. వివాహాది శుభ కార్యాచరణకు నాంది పలుకుతారు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమ పడతారు. రాజకీయులకు ఉత్తమకాలం. విద్యార్థులకు శ్రమ.

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

19, 24తేదిల్లో మకర లగ్నాన తె.4.00 నుండి 6.00 గంటల వరకు.
20తేది మేష లగ్నాన ఉ.10.00 నుండి 12.00 గంటల వరకు.
24తేది తులా లగ్నాన రా.11.00 నుండి 1.00 గంట వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### ఫిబ్రవరి తిథులు

**మాఘ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 19 | శని | పాడ్యమి | ఉ.10.18 | గం.ల.వ |
| 20 | ఆది | విదియ | ఉ.6.34 | గం.ల.వ |
| | | తదియ | తె.3.00 | గం.ల.వ |
| 21 | సోమ | చవితి | రా.11.44 | గం.ల.వ |
| 22 | మంగళ | పంచమి | రా.8.58 | గం.ల.వ |
| 23 | బుధ | షష్ఠి | రా.6.48 | గం.ల.వ |
| 24 | గురు | సప్తమి | సా.5.20 | గం.ల.వ |
| 25 | శుక్ర | అష్టమి | సా.4.34 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉంటాయి. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. గడచినకాలం కన్నా మేలైన కాలం. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.




సంతాన మూలంగా ఉత్సాహకరమైన వార్త వింటారు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. ధనాదాయ విషయంలో లోటుండదు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. నూతన వస్త్రాభరణాలు కొంటారు. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు.




ఆహార విషయంలో జాగ్రత్త. అభిప్రాయ భేదాలు రాకుండా చూసుకోవాలి. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. శత్రువులు లొంగి నడచుకొంటారు. అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం.




ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసర విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాముల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి. విద్యార్థులు కఠినంగా శ్రమించాలి.




ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ధనవిషయంలో కూడ కటకట తొలగవచ్చు. వ్యాపారులకు గడచిన వారంలోకన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహ సంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. రాజకీయులకు దురదృష్టకాలం. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.




ముందుచూపుతో అడుగేయాలి. ప్రతి విషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. నరాలకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌవుతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. ఎవరికి ఎలాంటిమాట ఇవ్వవద్దు.

# "ఏకజాతి వర్ణవర్గు దంపతుల వివాహం" శుభస్కరం!

*డి.రమామణి — హైదరాబాద్*

** అతనిది వృశ్చిక రాశి, అమ్మాయిది కర్కాటక రాశి. వివాహం జరుపవచ్చునా?*

పై రెండు రాశులు 'బ్రాహ్మణ' జాతి వర్ణ వర్గుకు చెందుతాయి. శాస్త్రాలు ఏకజాతి వర్ణవర్గు వివాహానికి అభ్యంతరం చెప్పడం లేదు.

*డి.జాహ్నవి — హైదరాబాద్*

** అబ్బాయిది మీన రాశి, అమ్మాయిది కన్య రాశి. వీరికి వివాహం చేస్తే సుఖంగా వుంటారా?*

వరుని మీనరాశి బ్రాహ్మణ జాతి వర్ణానికి, అమ్మాయి కన్యరాశి శూద్ర జాతికి చెందుతుంది. వరునిది అగ్ర రాశి అయి, వధువుది శూద్ర జాతి వర్ణం అయినా వివాహం చేయవచ్చు.

*పెరమన కాత్యాయని — చెన్నై*

** మా వారిది మేషరాశి, నాది సింహ రాశి. మేం ఏ దిక్కు ప్లాట్లు కొనుగోలు చేయవచ్చు?*

మేషరాశికి అధిపతి కుజుడు(అంగారకుడు). అతనికి దక్షిణ స్థలం. సింహరాశికి అధిపతి సూర్యుడు. మీకు తూర్పు స్థలం కలసి వస్తాయి.

*ఐ.సుభద్రాదేవి — విజయవాడ*

** భర్త చనిపోయాక స్త్రీ నిరలంకార కావాలా?*

అది వారి వారి నమ్మకాల్ని బట్టి వుంటుంది. ప్రాచీన శాస్త్రాలలో విధవ వివాహాలు, విధవ గృహాధిపత్యాలు వున్నాయి. పైగా పసుపు, కుంకుమలు స్త్రీకి పుట్టుకతో వచ్చాయి. నడిమంత్రపు భర్తలతో రాలేదన్నది నగ్న సత్యం కదా!

*షేక్ రహీం — తడ*

** 'శూర్పాకారం' అంటుంటారు. అంటే ఏమిటి?*

'శూర్పం' అంటే 'చేట' అని అర్థం. స్థలం 'చేట' ఆకారంలో వుంటే యజమానికి మృత్యువని "సమరాంగణ సూత్రధారణ" గ్రంథం చెబుతోంది.

*పంటరెడ్డి లావణ్యారెడ్డి — చెన్నై*

** ప్రాచీన గ్రంథాలలో తూర్పు వైపు ఏ నిర్మాణాలు చేయవచ్చునని చెప్పారు?*

ఈశాన్య దైవ గృహం, తర్వాత ప్రసూతి, స్నాన, వంట గదులు వరుసగా నిర్మించుకోవచ్చునని విశ్వకర్మ ప్రకాశిక, నారద సంహిత గ్రంథాలు చెప్పాయి.

*డి.నారాయణరెడ్డి — గుంటూరు*

** 'పడమర' దిక్కు లోపాలున్నాయి. పశ్చిమ లోపాలుంటే ఏమౌతుంది?*

పడమర అధిపతి వరుణుడు. అధిష్టాన దేవత శని. అతను నపుంసకుడు. ఈ దిశా లోపాలు యజమానికి అనారోగ్యం, రెండవ పురుష సంతానానికి భ్రష్టతను కలుగజేస్తాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సుబ్బారావు — గుంటూరు*

** విధవ అత్తగారు అల్లుడి ఇంట్లో నివసించవచ్చా?*

విధవ తల్లిగారికి స్థానం వున్న ఇంట్లో విధవ అత్తగారు అతిథిగా వస్తూపోతూ వుండవచ్చు. ఇది విశ్వామిత్ర సంహిత ఉవాచ. నిజంగా నిరాశ్రయులైన వారిని ఎవరైనా మానవీయకోణంలో పోషించవచ్చు.

*కె.తిరుపతిరావు — కర్నూలు*

** కలియుగం జీవితకాలం ఎన్ని సంవత్సరాలు? 2012లో ప్రపంచం అంతం అంటున్నారే?!*

కలియుగం శాస్త్రాల ప్రకారం 4,32,000 వేల సంవత్సరాలు. 2012లో అంతం కేవలం ఊహాగానం మాత్రమే. మెక్సికో మాయాజాతి కేలండర్ 2012 డిసెంబరు 21వ తేదితో ముగుస్తుంది. కేలండర్ ముగింపును భూమి అంతంతో ముడిపెట్టి కొందరు పెద్ద ఎత్తున ప్రచారం చేశారు.

*బి.ఈశ్వరనాయుడు — ప్రొద్దుటూరు*

** మెట్లు ఇంటి లోపల దుష్ఫలితాలెలా వుంటాయి?*

నైరుతి మెట్లు నిరుతి స్థానాన్ని అగాధంచేసి వ్యాధిని, మరణాన్ని, వాయువ్యం మనోవ్యధను, కోర్టు వాజ్యాలను, ఆగ్నేయం స్త్రీ వ్యాధుల్ని, ఈశాన్యం సర్వనాశనాన్ని కలుగజేస్తాయని జైమిని వాస్తు చెబుతోంది.

● కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల...

# ప్రోత్సాహకాల్లో గోల్మాల్!

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో విధులు నిర్వహించే కొందరు వైద్యులు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లకు కేటాయించిన నిధులను జేబుల్లో వేసుకొంటున్నారు. ఆపరేషన్లు చేయించుకొన్న మహిళలకు రిక్తహస్తం చూపెడుతున్నారు.


అదుపులో లేని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు.

జిల్లాలో కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు చేయించుకున్న వారికి అందించే ప్రోత్సాహ నగదులో పలు అక్రమాలు చోటు చేసుకొంటున్నాయి. జనాభాను అరికట్టాలన్న లక్ష్యంతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల ప్రోత్సహిస్తున్నాయి. ఈ ఆపరేషన్లు చేయించుకున్న వారికి పారితోషికంగా రూ.600 ఆపరేషన్ చేసిన వైద్యశాలల్లోనే ఈ నగదును లబ్ధిదారులకు అందించాల్సి వుంటుంది. అయితే కొంత మంది వైద్యులు నిధులు లేవని సాకుచెప్పి స్వాహా చేస్తున్నారు. నెలల తరబడి వీరి చుట్టూ తిరిగి గట్టిగా ప్రశ్నిస్తే తప్ప పారితోషికంగా ఇవ్వాల్సిన నగదు ఇవ్వడం లేదు.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్లకు సంబంధించి ఇప్పటికే వైద్య, ఆరోగ్య శాఖపై అనేక ఆరోపణలున్నాయి. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయకపోయినా కూడా కొందరు పేర్లను నమోదు చేయడం. ఒకసారి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న వారిని తిరిగి నమోదుచేసి లక్షలాది రూపాయల నిధులు డ్రా చేసుకున్నారు. ఈ అక్రమాలపై గతంలో జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిగా పనిచేసిన ఆనంద్ సిబ్బందిని ప్రశ్నిస్తే ఆయన ఛాంబర్‌లోనే దాడిచేసిన సంఘటనలున్నాయి. దాదాపు ఎనిమిది లక్షల రూపాయలకు లెక్కలు తేల లేదు. ఎంత మంది అధికార్లు మారినా ఎన్ని విచారణలు జరిపినా బాధ్యులను గుర్తించి చర్యలు తీసుకున్న దాఖలాలు కనిపించడం లేదు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో విధులు నిర్వహించే కొందరు వైద్యులు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లకు కేటాయించిన నిధులను జేబులో వేసుకుంటున్నారు. వైద్యశాలలో ఈ ఆపరేషన్ చేయించుకున్న మహిళ చేత సంబంధిత రికార్డులలో ముందుగానే సంతకాలు చేయించుకుంటున్నారు. నిధులు మంజూరైతే తెలియజేస్తామని చెప్పి ఇంటికి పంపుతుంటారు. లబ్ధిదారులకు అందించాల్సిన నగదును వైద్యులు తీసుకుంటున్నారు. రికార్డులలో మాత్రం ఇచ్చినట్లుగా నమోదవుతుంది. ఇటువంటి సంఘటన నగరంలో జూబ్లీ హాస్పిటల్ ఆవరణలో వున్న చిన్నపిల్లల వైద్య విభాగంలో చోటుచేసుకుంది. ఈ విభాగంలో ఇంతకు ముందు విధులు నిర్వహించిన వైద్యురాలు ప్రోత్సాహ నగదును స్వాహా చేసింది.

బుచ్చిరెడ్డిపాళెంకు చెందిన మంజుల అనే మహిళ గత సంవత్సరం జూన్‌లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంది. ఈమె చేత రికార్డులలో సంతకాలు చేయించుకున్న వైద్యురాలు నగదు మాత్రం ముట్టచెప్పలేదు. దాదాపు ఎనిమిది నెలలు గడిచినా కూడా వైద్యురాలు నగదు అందించేందుకు ముందుకు రాలేదు. ఎన్నిసార్లు ఈమె చుట్టూ తిరిగినా కూడా ఫలితం లేకుండా పోయింది. రెండు నెలల క్రితం ఇక్కడ నుంచి కోవూరు పిహెచ్‌సికి బదలీపై వెళ్లింది. కొత్తగా వచ్చిన వైద్యుడు ప్రోత్సాహ నగదు మంజూరుపై ఆరా తీయడంతో అనేక లొసుగులు బయట పడ్డాయి. రికార్డులలో చాలా మందికి నగదు అందించినట్లు నమోదుకాగా లబ్ధిదారులు మాత్రం తమకు అందలేదని వాపోతున్నారు.

కోవూరుకు బదలీపై వెళ్లిన వైద్యురాలు హయాంలో నగదు మంజూరులో అనేక అవినీతి అక్రమాలు జరిగాయి. ఇటువంటి వైద్యుల వైఖరి కారణంగా కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల లక్ష్యాలు నెరవేరకుండా పోతున్నాయి. ఇప్పటికైనా జిల్లా వైద్య ఆరోగ్య శాఖ అధికారులు స్పందించి లబ్ధిదారులకు నగదు అందించడంతోపాటు అక్రమాలపై విచారణ జరిపించాల్సిన అవసరం వుంది.



దాణా బొక్కేశారు

# పశువుల దాణా బొక్కేసిన పశుసంవర్ధక శాఖాధికారులు!

**జిల్లాలో లైలా తుఫాన్ కారణంగా పశువుల మేతకు తీవ్ర ఆటంకం ఏర్పడిందని, అవసరమైన నిధులు విడుదల చేయాలని ప్రభుత్వానికి నివేదిక పంపి నిధులు తెచ్చుకొన్న పశుసంవర్ధక శాఖాధికారులు చివరికి వాటిని దిగమ్రింగేయడం చర్చనీయాంశమయ్యింది.**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశ పెట్టిన పథకాల అమలుకు ఎన్ని నిబంధనలు విధించినా ఏదో ఒక విధంగా తూట్లు పడుతూనే వున్నాయి. నిధులు మంజూరు దగ్గర నుంచి వాటిని లబ్ధిదారులకు అందించే వరకు సంబంధిత శాఖ అధికారులు కీలకపాత్ర పోషిస్తుంటారు. ప్రజల అమాయకత్వాన్ని, అవసరాలను అవకాశంగా తీసుకొని చేతివాటం కూడా ప్రదర్శిస్తుంటారు. అధికారులు, సిబ్బంది అవినీతి, అక్రమాల కారణంగా ప్రభుత్వ లక్ష్యాలు నెరవేరకుండా పోవడంతో ప్రభుత్వ పథకాలు సైతం నిర్వీర్యమైపోతున్నాయి.

ఇప్పటికే అవినీతి అక్రమాల్లో వివిధ ప్రభుత్వ శాఖలు ఆరోపణలు ఎదుర్కొంటుండగా తాజాగా పశుసంవర్ధక శాఖ ఈ జాబితాలో చేరింది. బీహార్ రాష్ట్రంలో గతంలో పశువుల దాణా సరఫరాలో కోట్ల రూపాయల కుంభకోణం జరిగిన సంగతి తెలిసిందే. ఇదే తరహాలో మన జిల్లాలో కూడా పశువుల దాణా పంపిణీలో అధికారులు బాగానే చేతివాటం ప్రదర్శించారు. గత సంవత్సరం మే నెలలో “లైలా” తుఫాన్ రావడంతో తీరప్రాంత గ్రామాల్లో భారీస్థాయిలో నష్టాలు సంభవించాయి. తుఫాన్, భారీవర్షాలు సంభవిస్తే కొన్ని శాఖల అధికారులకు ఆదాయం చేకూరుతుంటుంది. వాటి సహాయం క్రింద ప్రభుత్వం అందించే నిధులను స్వాహా చేస్తుంటారు. లైలా తుఫాన్ కారణంగా పశువుల మేతకు తీవ్ర ఆటంకం ఏర్పడిందని, ఇందుకు అవసరమైన నిధులు విడుదల చేయాలని పశుసంవర్ధక శాఖ అధికారులు ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. దీంతో ప్రభుత్వం పశువులకు అవసరమైన దాణాను అందించేందుకు నిర్ణయించి, అవసరమైన నిధులను విడుదల చేసింది. ఈ నిధులతో దాణాను కొనుగోలు చేసిన అధికారులు గుర్తించిన లబ్ధిదారులకు ఉచితంగా అందించాల్సి వుండగా వారి వద్ద నుంచి నగదును వసూలు చేశారు. ఉచితంగా అందించాల్సిన దాణాకు నగదును వసూలు చేయడం ఏమిటని ఎవరైనా ప్రశ్నిస్తే ఇన్సూరెన్స్ కోసమంటూ సాకు చెప్పారని ప్రజలు అంటున్నారు.

జిల్లాలోని తీరప్రాంత మండలాల్లో ఒక్క అల్లూరు మండలానికి దాదాపు 308 బస్తాల దాణా ప్రభుత్వం సరఫరా చేసింది. ఒక్కో బస్తాలో 50 కిలోల దాణా వుంటుంది. ఒక్కో లబ్ధిదారుని వద్ద 70 నుంచి 100 రూపాయల వరకు పశువైద్యులు వసూలు చేశారు. లబ్ధిదారుల ఎంపికలో కూడా అనేక అవకతవకలు చోటుచేసుకొన్నాయి. పశువులు వున్న వారి పేర్లతోపాటు లేని వారి పేర్లను సైతం దాణా పంపిణీ జాబితాలో చేర్చారన్న ఆరోపణలు వున్నాయి.



పలు అవకతవకలకు నిలయమైన పశుసంవర్ధకశాఖ కార్యాలయం.

దాదాపు పది నెలల క్రిందట సంభవించిన “లైలా” తుఫాను దాణా ఇటీవల ప్రభుత్వం విడుదల చేయడం ఒక ఎత్తైతే వచ్చిన దాణాను పశువైద్యులు అమ్ముకోవడం మరో విశేషం. ఇదేవిధంగా తీరప్రాంత మండలాల్లో దాణా పంపిణీపై ఆరోపణలు వచ్చిన నేపథ్యంలో ఆశాఖ జిల్లా జాయింట్ డైరక్టర్ విచారణ కూడా చేపట్టారు. ఆయన కూడా జరిగిన అక్రమాలను బయటపెడితే పరువుపోతుందని భావించారో ఏమో తెలియదుగానీ ఇన్సూరెన్సు కోసమే నగదు వసూలు చేశారని కితాబు ఇవ్వడం కొసమెరుపు.



# హద్దులు తెలుసు!



అందంపై ఎవరి ఆలోచనలు వారికుంటాయి. అందం కంటికోరకంగా కనిపిస్తుంది. ఒక వస్తువుని చూసేటపుడు ఎంత అందంగా వుందో చెప్పాలంటే ఆ సమయంలో ఆ వ్యక్తి మానసిక ఆలోచనపై ఆధారపడి వుంటుందని హీరోయిన్ కాజల్ చెబుతుంది. తెలుగు యువ హీరోలందరి సరసన నటిస్తూ అగ్ర కథానాయికల రేసులో దూసుకపోతున్న కాజల్‌ను అందాల ఆరబోత విషయంలో మీ హద్దులేంటి? అని అడిగినప్పుడు ఇదంతా చెప్పింది. అందంగా కనపడటం వేరు, హద్దులు దాటి అందాలు ఆరబోయడం వేరు. ఈ రెండింటికీ వున్న తేడా నాకు తెలుసు. అందుకే శ్రుతిమించి ఎప్పుడూ అందాలు ఆరబోయలేదు. నేను సినిమా ఒప్పుకొనేటప్పుడు ముందుగా ఆలోచించేది ఈ విషయం గూర్చే. పాత్రలో నటించాక ఆ సినిమాను ముందు నేను నా కుటుంబ సభ్యులతో కలసి చూడగలనా?లేదా? అని. అందువల్ల అందం హద్దుల విషయంలో తనకు బాధ లేదంటుంది.

# చెంపలేసుకొన్న కత్రినా!



తీస్మార్ ఖాన్ చిత్రంతో తన రేంజ్ బాగా పెరిగిపోతుందని భావించిన కత్రీనా కైఫ్‌కు ఆ చిత్రం బాక్సాఫీసు వద్ద బోల్తా కొట్టి పరాజయాన్ని చవిచూసి చేదు జ్ఞాపకాన్నే మిగిల్చింది. దీంతో కత్రినా తీవ్ర ఆలోచనలో పడింది. తీస్మార్ ఖాన్‌లో కొరియోగ్రాఫర్, డైరక్టర్ ఫరాఖాన్ ప్రోద్భలంతో కాస్తంత ఓవర్ ఎక్స్‌పోజింగ్ చేసేసింది. 'షీలాకా జవానీ' పాటలో రెచ్చిపోయి అందాల ప్రదర్శన చేసేయడం కత్రీనా ఇమేజ్‌ను చాలా డామేజ్ చేసింది. ఇలా ఎందుకు చేశానని కత్రీనా మదన పడుతుంది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ సినిమా విజయం సాధిస్తే దాన్ని పెద్దగా పట్టించుకొనే దాన్ని కాననీ, ఫ్లాపయ్యాక మరోమారు చూసుకుంటే తనకే చాలా వల్గర్‌గా అనిపించిందని వాపోయింది. ముందు ముందు ఇలాంటి తప్పులు చేయబోననీ, ఎక్స్‌పోజింగ్ విషయంలో కాస్త జాగ్రత్తగా వుంటానని చెప్పుకొచ్చింది.



సినిమాల్లో కనిపించేంతా సరదాగా బయట సినిమా తారలు వుండరు. తెగ గొప్పలకు పోతారు. ఇది సినిమా తారల గూర్చి జనంలో వినపడే మాటలంటుంది హీరోయిన్ జెనీలియా. అయితే దీనికి తాను విరుద్ధమంటుంది. నాకు

## సాదాసీదా జీవితం

లోపల ఒకటి పెట్టుకొని బయటకు మరొకటి చెప్పడం చేతకాదు. మనసులో ఏమి వుంటే పెదవి దాటి అదే వస్తుంది. నేను పెద్ద సినిమా తారనని గర్వం నాకు కొంచెం కూడా లేదు. సాదాసీదా జీవితం గడపటంలోనే ఆనందం కలుగుతుంది. నలుగురితోనూ కలసిపోవటానికే ఇష్టపడతాను. కయ్యానికి కాలుదువ్వే మనస్తత్వం తనది కాదని చెప్పుకొచ్చింది.

# మళ్లీ 'పూజాబేడి'



90వ దశకంలో కామసూత్ర కండోమ్ ప్రకటనలో నటించి దేశ వ్యాప్తంగా సంచలనం రేకెత్తించిన తార పూజాబేడి. తెలుగులోను చిట్టెమ్మ మొగుడు చిత్రంలో సెక్సీ డాక్టర్‌గా కనిపించింది. అందులో మోహన్‌బాబు హీరో. చాన్నాళ్ల తర్వాత పూజాబేడి తెలుగు తెరపై కనిపించబోతోంది. ఎన్టీఆర్ హీరోగా నటిస్తున్న శక్తి చిత్రంలో ఈజిప్ట మహారాణిగా ఆమె కనిపిస్తుంది. ప్రతినాయక ఛాయలున్న పాత్ర అది. ఈ సినిమా రూపకల్పన శైలి, ఎన్టీఆర్ నటనల గూర్చి పూజ చెబుతూ ఎన్టీఆర్ చాలా మంచి నటుడు. స్వీట్ పర్సన్. శక్తి తెరకెక్కుతున్న తీరు అద్భుతం. నాది విలన్ పాత్ర అయినా నటిగా ఎంతో సంతృప్తినిచ్చిన పాత్ర అంది.

# నాజూకు నడుము కోసం...



హీరోయిన్ కరీనాకపూర్ అంటే అందరికీ తెలిసిన టాగ్‌లైన్ జీరో సైజ్ హీరోయిన్ అని. తానిలా తయారవ్వడం వెనుక డైటీషియన్ వున్నాడంటుంది. బాగా తిను, సరైందితిను, టైముకు తిను అని ఆయన చెప్పేవాడు. ఈ మూడింటిని సమన్వయ పరచుకొని ఆహారయజ్ఞం కొనసాగించడంతో శరీరం మన అదుపులోకి వస్తుందంది. ఇంకా లోతుగా చెప్పాలంటే డెబ్భై శాతం ఆహారపు అలవాట్లు, 30 శాతం వ్యాయామం వల్ల మన శరీరం క్రమబద్ధంగా ఆరోగ్యంగా వుంటుందని తేల్చి చెప్పింది కరీనా.

# గగనం... ఓ ప్రయోగం!




✍ అల్లూరు రహీం

రొటీన్‌కు భిన్నంగా తీసిన చిత్రం గగనం. ఈ చిత్రానికి దిల్ రాజు నిర్మాత. గతంలో 'ఆకాశమంత' చిత్రాన్ని తీసిన రాధామోహన్ కథ, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వం వహించారు. తెలుగు, తమిళ భాషల్లో తయారైన ఈ చిత్రంలో పాటలు, ఫైట్లు, ప్రేమా యణం, కామెడీ ట్రాకులు లేవు. భావోద్వేగ సన్నివేశాలతో కథ, కథ నం సాగుతుంది. 12రీళ్ల ఈ చిత్రంలో తన 25ఏళ్ల సినీ కెరీర్‌లో విభిన్న చిత్రాలలో నటించిన హీరో నాగార్జున సాహసం చేసి నటించాడనాలి. కథల నడతకు కొత్తదారి చూపే ఈ చిత్రం వాణిజ్యపరంగా పెద్ద విజయం సాధించకపోయినా రొటీన్ చిత్రాలకు భిన్నంగా కొన్ని తెలుగు చిత్రాలు తయారయ్యేందుకు దోహదపడితే అంతే చాలనాలి. గతంలో కాందహార్‌కు విమానం హైజాక్ చేసిన సంఘటన నేపథ్యంలో ఈ చిత్రానికి దర్శకుడు కథ అల్లుకున్నాడు. అయితే విమానంలో వుండే ఒక మిలటరీ కల్నల్, కేంద్రమంత్రి, క్రిస్టియన్ ఫాదర్, సినీహీరో, నిరుద్యోగి, డాక్టర్, పాకిస్తాన్ చిన్న పాపల నటనతో సినిమా చూస్తున్నట్లుగా కాకుండా యదార్థంగా జరుగుతున్నట్లు అనిపిస్తుంది. ఇంగ్లీషు చిత్రాలంత గొప్ప స్థాయిలో కాకున్నా ఓ విమానాశ్రయం, విమానంతో కథ నడిపిన తీరు బాగుంది. తీవ్రవాదుల్లోనూ హృదయముంటుందని చూపిన తీరు బాగున్నా వారిని చూపే సమయంలో ముస్లింలు ఎంతో పవిత్రంగా భావించే కల్మా – అవుజు బిల్లాహిని విన్పించేలా చేయడం పెద్ద తప్పు. దీని అర్థం తెలియక సెన్సార్ సర్టిఫికేట్ ఇవ్వడం ఇంకా పెద్ద తప్పు. నాగార్జున, పృథ్వి, ప్రకాష్‌రాజ్, బ్రహ్మానందం తప్ప అందరూ తమిళ నటులే ఈ చిత్రంలో కనిపిస్తారు. ఓ ప్రయాణీకుడ్ని టెర్రరిస్టులు కాల్చేసినప్పుడు తోటి ప్రయాణీకులు పడే బాధతోపాటు, ఫాదర్ బైబిల్ చదవడం, మంచు ఉత్పాతం, తీవ్రవాదికి భారతీయ డాక్టర్ వైద్యం, పాకిస్తాన్ బాలిక అఫ్సానా హైజాకర్లను అడిగే ప్రశ్నలతో కూడిన సన్నివేశాలు బాగున్నాయి. అనూరాధ ఉమర్జీ వ్రాసిన మాటల్లో మన నాయకులకు ఎలక్షన్ తప్ప ఏమీ పట్టవు. వియత్నాం యుద్ధం ఒక జర్నలిస్ట్ వల్ల ఆగింది. రాజ్‌భవన్‌లోనే కెమెరా పెట్టారు ఆలోచింపజేస్తాయి. ప్రవీణ్ మణి నేపథ్య సంగీతం, కెవిగుహన్ కెమెరా బాగున్నాయి.

చిత్రకథలోకి వెళ్తే చెన్నై నుంచి ఢిల్లీ వెళ్లే స్టార్ జెట్ విమానాన్ని పాకిస్తానీ తీవ్రవాదులు హైజాక్ చేస్తారు. విమానంలో ఒక ఇంజను ధ్వంసం చేయడంతో దాన్ని అత్యవసరంగా తిరుపతి విమానాశ్రయంలో దించేస్తారు. హైజాకర్లు భారతదేశ జైలులో వున్న కరడుగట్టిన పాకిస్తాన్ తీవ్రవాది యూసఫ్ ఖాన్‌ను విడుదల చేయమని, ఆయనకు తోడుగా 100 కోట్ల రూపాయలిస్తే ప్రయాణీకులను విడుదల చేస్తామంటారు. కేంద్ర విదేశాంగశాఖలోని శర్మ (మేల్కొటే), విశ్వనాథ్ (ప్రకాష్‌రాజ్), కమెండో దళంలోని రవీంద్ర (నాగార్జున) హుటాహుటీన తిరుపతి వస్తారు. టెర్రరిస్టులతో మాటామంతీ కలుపుతారు. రవీంద్ర చేస్తానన్న కమెండో ఆపరేషన్‌ను వద్దని మూడురోజులు సాగదీస్తారు. తీవ్రవాది యూసఫ్‌ఖాన్‌ను కాశ్మీర్ జైలు నుంచి విడుదల చేసి తీసుకవస్తుండగా అతను తీవ్రమైన మంచు తుఫానులో చిక్కుకొని మరణిస్తాడు.




తెలుగు ఛానళ్ల స్క్రోలింగ్ న్యూస్ మధ్య విమానంలోని ఇద్దరు ప్రయాణీకులను తీవ్రవాదులు కాల్చి చంపుతారు. చివరి నిమిషంలో కమాండో ఆపరేషన్‌కు రంగం సిద్ధమవుతుంది. విమానంలో టాయిలెట్స్ కడిగే యువతి ద్వారా ఎయిర్‌హోస్టస్‌కు ఒక సందేశం పంపుతారు. ఆమె ఆ సందేశాన్ని కల్నల్ జగదీష్‌కు అందిస్తుంది. అందరు ప్రయాణీకులను ఆయన అలర్ట్ చేసి డూప్ యూసఫ్‌ఖాన్‌ను టెర్రరిస్టులకు అప్పగించే సమయంలో వేసిన ఎత్తుగడతో వారినందరినీ కమెండో రవీంద్ర మట్టుబెట్టడంతో చిత్రం ముగుస్తుంది.

కమెండో పాత్రలో నాగార్జున చక్కని నటన ప్రదర్శించాడు. ప్రకాష్‌రాజ్, బ్రహ్మానందంతో పాటు ఇతర నటీనటుల చేత మంచి నటన రాబట్టడంతో దర్శకుడు రాధామోహన్ విజయం సాధించాడు.



## ఔను... వాళ్లిద్దరూ ఒకటయ్యారు

### ఆనంను ఆదాలను కలిపిన అవసరాలు



మంత్రి రామనారాయణరెడ్డితోపాటు ఆయన నివాసంలో జరిగిన విలేఖరుల సమావేశంలో పాల్గొన్న సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల.

రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, సర్వేపల్లి శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డిల కలయిక కాంగ్రెస్ పార్టీలో మారుతున్న రాజకీయ సమీకరణలకు అద్దం పడుతోంది. గత కొన్నాళ్ల నుంచి వీరి రువురి మధ్య రాజకీయ వైషమ్యాలు కొనసాగుతున్నాయి. ఒక సంద ర్భంలో ఆనం, ఆదాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనే పరిస్థితేర్పడింది. ఆ తర్వాత కాలంలో ఆనం వారికి వ్యతిరేకంగా ఏర్పాటైన రాజీవ్‌భవ న్‌కు జడ్పీ ఛైర్మన్ కాకాణితో కలిసి ఆదాల పూర్తి సహకారం అందించ దంతోపాటు మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లితో సన్నిహితంగా మెలి గారు. ఈ పరిస్థితులలో ఆనం రామనారాయణరెడ్డితోపాటు 2004, 2009లోనూ మంత్రి పదవి కోసం రామనారాయణరెడ్డితో పోటీపడి విఫలమయ్యారు. ఈ పరిస్థితుల్లో మేకపాటి సోదరులు, రాజీవ్‌భవన్ నేతలు జగన్ వెంట నడవడం, జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి సైతం జైజగన్ అనడంతో ఒంటరివాడైన ఆదాల చివరకు ఆనంతో కలిశాడు. అందరి అభిప్రాయాలను పటాపంచలు చేస్తూ కొన్నాళ్లపాటు ఆనం సోదరులతో నెరపిన వైరాన్ని మరచి మంత్రి రామనారాయణ రెడ్డితో కలవడం మారుతున్న రాజకీయ పరిణామాలను తెలియ పరు స్తోంది. ఈ కలయిక భవిష్యత్తులో ఎలాంటి పరిణామాలకు దారితీ స్తుందో వేచి చూడాల్సి వుంది.

## సర్కారీ బడుల్లో సాగని చదువు

### ● ఉపాధ్యాయులకు రకరకాల విధులతో ఆటంకం



విద్యార్థులకు నష్టం కల్గిస్తున్న జిల్లా విద్యాశాఖ.

మూలిగే నక్కపై తాటి పండు పడ్డ చందంగా వుంది ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థుల పరిస్థితి. అర కొర వసతులు, అసౌకర్యాలు, పూర్తిగా అందని పాఠ్యపుస్తకాలు, ఉపాధ్యాయుల కొరత నడుమ చదువు సాగిస్తున్న విద్యార్థులకు మరో సమస్య వచ్చి పడింది. మార్చిలో జరుగుతున్న పరీక్షలకు సమస్యల నడుమ సిద్ధం అవుతున్న వారికి వున్న ఉపాధ్యాయులను బోధనేతర విధులకు కేటా యించడంతో చదువులు అటకెక్కుతున్నాయి. ప్రతి కార్యక్రమానికి ప్రభుత్వ పాఠశాలల్లో పని చేసే ఉపాధ్యాయులను వినియోగిస్తుండడంతో విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు. జాతీయ స్థాయిలో జరుగుతున్న జనాభా లెక్కల సేకరణ జనగణనకు ఉపాధ్యాయులకు డ్యూటీలు వేయ డంతో పలు పాఠశాలల్లో ఉపా ధ్యాయులు లేకుండానే విద్యా ర్థులు చదువుకోవాల్సిన పరిస్థి తులు ఏర్పడుతున్నాయి. పరీ క్షలు ముంచుకొస్తున్న తరు ణంలో కీలకమైన ఉపాధ్యాయు లను బోధనేతర పనులకు వినియోగిస్తుండడం విద్యార్థుల పాలిట శాపంగా పరిణమిస్తోంది. ఒకపూట జనగణన, రెండో పూట పాఠశాలకు హాజరుకాలేక బడి మొహమే చూడలేని స్థితి. ముఖ్యంగా పదవ తరగతి చదివే విద్యార్థులు తీవ్రంగా నష్టపోవాల్సి వస్తోంది. అధికారులు సైతం విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో పెట్టు కోకుండా వారి భవిష్యత్తు కంటే బోధనేతర పనులకే ప్రాధాన్యతనివ్వడం విమర్శల పాలవు తోంది. కొందరు ఉపాధ్యాయులు జనగణనకు ససేమిరా అన్నా వారిపై ఒత్తిడి తెచ్చి మరీ విధు లకు హాజరు చేయడం వల్ల ఉపాధ్యాయ సం ఘాల నుంచి ఆక్షేపణలు వెల్లువెత్తుతున్నాయి. దీనికితోడు ప్రభుత్వ పాఠశాల ఆవరణలు పలు కార్యక్రమాలకు వేదిక కావడంతో విద్యార్థుల చదువులకు ఆటంకం కల్గుతోంది. నేతలు మైకుల ముందు మాటలతో ఊదరగొడ్తుండ డంతో చదువులకు బ్రేక్ పడుతోంది.

## బ్లాక్ మెయిల్ తగదు

### ❍ ఆనం సోదరులకు జడ్పీటీసీల హితవు




విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న జడ్పీటీసీలు వీరు చలపతి, అనిత, చిరంజీవి రెడ్డి, గోగుల వెంకయ్య.

తన విలక్షణ పనితీరుతో రాష్ట్రంలోనే ఉత్తమ జడ్పీ ఛైర్మ న్‌గా ప్రశంసలందుకొన్న కాకాణి గోవర్ధన్‌రెడ్డిపై ఆనం బ్రదర్స్ బ్లాక్‌మెయిల్ రాజకీయాలకు పాల్పడడం తగదని పలువురు జడ్పీటీసి సభ్యులు ఆవేదన వ్యక్తం చేశారు. విడవలూరు, కొండాపురం, దగదర్తి, కలిగిరి జడ్పీటీసి సభ్యులు విలేకరులతో మాట్లాడుతూ వైఎస్ జగన్మోహన్‌రెడ్డికి కాకాణి మద్దతు తెలపడంతో పెద్ద సంఖ్యలో జడ్పీటీ సిలు, ఎంపిపిలు, ఎంపిటిసీలు, వేలాదిగా కార్యకర్తలు ఆయనకు మద్దతు తెలపడాన్ని జీర్ణించుకోలేక ఆనం బ్రదర్స్ ఏసిబి దాడులతో నీచ రాజకీయాలకు తెర ఎత్తారన్నారు. ఇలాంటి తాటాకు చప్పుళ్లకు కాకాణి వెన్ను చూపరన్నారు. ఎసిబి దాడులకు తామంతా సిద్ధమేన న్నారు. ఆనం సోదరులపై గత కొన్నేళ్లుగా వస్తున్న ఆరోపణలపై బహి రంగ విచారణకు సిద్ధపడే ధైర్యం వాళ్లకు వుందా అని ప్రశ్నించారు. కాకాణిని రాజకీయంగా ఎదుర్కోలేక తమకు అంటిన బురదను జడ్పీ ఛైర్మన్‌కు పూసే ప్రయత్నాలు మానుకోకపోతే ప్రజలు తగిన రీతిన, తగిన సమయంలో బుద్ధి చెబుతారన్నారు.




విలేఖరుల సమావేశంలో కొత్త పథకం వివరాలను తెలియజేస్తున్న టెలికాం జిఎం గోపి, మార్కెటింగ్ డిఇ మార్కొండా రెడ్డి.

## ఎస్ఎంఎస్‌తో అన్ని సేవలు!

బిఎస్ఎన్ఎల్‌కు చెందిన వినియోగదారులు తమకు కావాల్సిన సేవలు, రీఛార్జి కూపన్లు కూడా మొబైల్‌లోనే ఎస్ఎంఎస్ ద్వారా పొం దవచ్చని టెలికాం జనరల్ మేనేజర్ గోపి చెప్పారు. 11వ తేది విలేఖరు లతో మాట్లాడుతూ తమ ఫోన్లకు సిగ్నల్ అందకపోయినా, బలహీ నంగా వున్నా, మాటలు స్పష్టంగా వినిపించకుండా ఇబ్బందులు పడు తున్నా వీటి పరిష్కారానికి ఎస్ఎంఎస్ పంపితే చాలన్నారు. ప్రత్యేక టారీఫ్ ఓచర్ల కోసం రిటైలర్లు, కస్టమర్ కేంద్రాలకు వెళ్లి కొనుక్కోవా ల్సిన అవసరం లేదని, టారిఫ్ ఓచర్ల కోసం ఎస్ఎంఎస్ చాలున్నారు. రీఛార్జి చేసుకోను ఇదే పద్ధతి పాటించవచ్చన్నారు. ఫిక్స్‌డ్ వైర్ లెస్ ఫోన్ ధరలు తగ్గించామన్నారు. విల్‌ఫోన్ లైఫ్ టైమ్‌ను మార్పు చేశామని, గతంలో వున్న 200 రూపాయలను 54 రూపాయలకు తగ్గించామన్నారు. ప్రతి మూడు నెలలకు రూ 54 రీఛార్జి చేసుకుంటే విల్‌ఫోన్ లైఫ్‌టైమ్ పెరుగుతూ వుంటుందన్నారు. బ్రాడ్‌బాండ్‌లో 850 రూపాయలు అన్ లిమిటెడ్ ప్లాన్ తీసుకొన్న వినియోగదారులకు ల్యాండ్ ఫోన్‌కు అద్దె లేదు. దీనికితోడు 350 ఉచిత కాల్స్, 8జిబి వరకు స్పీడ్, 1 ఎంబిపిఎస్, అనంతరం 256 బీపీఎస్ స్పీడ్ వుంటుం దన్నారు.

## కొత్త కలెక్టరేట్ నిర్మాణం

### ❍ సిఎంతో మార్చి నెలలో శంకుస్థాపన.

నెల్లూరు టిబి ఆసుపత్రి ఆవరణలో 35 కోట్ల రూపా యలతో నిర్మించనున్న కలెక్టరేట్ భవనానికి సిఎం కిరణ్ కుమార్‌రెడ్డి శంకుస్థాపన చేస్తారని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. సంతపేటలోని ఆయన స్వగృహంలో విలేకరులతో మాట్లాడుతూ ఎమ్మెల్సీ ఎన్నికల నోటిఫికేషన్ వెలువడడంతో ముఖ్యమంత్రి జిల్లా పర్యటన రద్దయ్యింది. ఈ పర్యటన రద్దుపై ప్రతిపక్షాలు నోటికొచ్చి నట్లు మాట్లాడడం తగదన్నారు. ఎమ్మెల్సీ ఎన్నికలు పూర్త యిన వెంటనే ముఖ్యమంత్రి నెల్లూరు వస్తారన్నారు. పెద్దా సుపత్రి ప్రాంగణంలోనే నూతన చిన్న పిల్లల ఆసుపత్రి నిర్మాణానికి సిఎం శంకుస్థాపన చేస్తారన్నారు. ఎంతో చరిత్ర గల టిబి ఆసుపత్రిని ప్రభుత్వాసుపత్రి ఆవరణకు మారుస్తున్నామన్నారు. జిల్లాలో రచ్చబండ కార్యక్రమం విజ యవంతమయ్యిందని, ఇప్పటివరకు 894 రచ్చబండ సమా వేశాలు జరిగాయన్నారు. వీటిలో 550 సభలకు ఎమ్మె ల్యేలు హాజరయ్యారని, పది సభలకు ఎమ్పీలు, 55 సభ లకు తాను, ఐదు సభలకు ఇన్‌ఛార్జి మంత్రి హాజరయ్యా రని తెలిపారు.

## కార్పొరేషన్‌లో అవినీతి సంగతేమిటి?



ఎసిబి అధికారికి వినతిపత్రం అందిస్తున్న టిడిపి మహిళా అధ్యక్షురాలు అంచల వాణి.

నెల్లూరు కార్పొరేషన్ అయ్యాక చెప్పలేనంత అవి నీతి జరిగిందని దీనికి కార కులైన వారిపై చర్యలు చేప ట్టాలని తెలుగు మహిళ విభాగం జిల్లా అధ్యక్షురాలు అంచల వాణి 11వ తేది ఎసిబి డిఎస్పీని కలసి విన తిపత్రం సమర్పించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లా డుతూ జిల్లాలో గత పది రోజులుగా జిల్లా పరిషత్, మండల పరిషత్ పంచాయితీ కార్యాలయాలపై ఎసిబి దాడులు జరుగుతున్నాయని, అక్కడ అవినీతిని వెలికితీయడాన్ని తాము సమర్థిస్తున్నా మని కార్పొరేషన్‌లో భారీ అవినీతి జరిగిందని, దీనిపై కూడా విచారించి బయట పెట్టా లన్నారు. నగరంలో ఎన్నో చోట్ల నాసిరకం రోడ్లు వేశారని, కాలువల పూడికతీత, డివై డర్ల నిర్మాణం, సర్కిళ్ల నిర్మాణాల పేరుతో కోట్ల రూపాయలు దిగమింగారన్నారు. ఎసిబి ఈ వ్యవహారాలన్నింటిని విచారించి ఈ అవినీతి వెనుక ఎవరి హస్తం వుందో ప్రజలకు చెప్పాలన్నారు. అన్ని చోట్ల ప్రజాధనం దుర్వినియోగం కాకుండా చూడాల్సిన బాధ్యత అవినీతి నిరోధక శాఖకు వుందన్నారు. మిగతా పార్టీల నేతలు ఈ వ్యవహారాపై ఊరు కొన్నా అంచలవాణి ధైర్యంచేసి ఎసిబికి వినతిపత్రం సమర్పించడం అభినందనీయం.

## సుడిగాలిలో చిక్కిన సర్కారు

మొదటి పేజీ కొరవ

ముదులు? వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వదలివెళ్లిన పథకాల ఫలాలు వెయ్యి పడగల నాగుల వలె మెడకు చుట్టుకొంటున్నాయి. వైఎస్ కాలం నాటి ఆర్థిక పొరపాట్లు ఉరిత్రాళ్లుగా పరిణమిస్తున్నాయి. అధిష్టానం అదుపు ఆజ్ఞలు ఒకపక్క, అదుపుతప్పిన మంత్రులు, ఎమ్మెల్యేలు మరొకపక్క, కనురెప్ప వాలిస్తే కుర్చీ పీక్కోవడానికి వైఎస్.జగన్ ఒకపక్క, కళ్లు తెరిచి చూస్తుండగానే గద్దె నుంచి కూలదోయడానికి తెలంగాణ గొడవ మరొక ప్రక్క, అధికారులు మాట వినడం లేదు. కార్యకర్తలు శాపనార్థాలు పెడుతున్నారు. ప్రజలు పెదవి విరుస్తున్నారు. ప్రతిపక్షాలు గేలి చేస్తున్నాయి. శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఇస్తే ఒక తంటా; కృష్ణ జలాల ట్రిబ్యునల్ తీర్పు చెప్తే మరొక తంటా.

ఒక సమస్య పోతే మరొకటి మెడకు చుట్టుకొంటుండడంతో కిరణ్‌కుమార్‌రెడ్డి ఉక్కిరి బిక్కిరౌతున్నాడు. ఇప్పటికిప్పుడు ఆయన ముందున్న సవాళ్లన్నీ కూడా రాజకీయ భూతాల వంటివే. శాసనసభ సమావేశాలు మొదలైనాయి. కానీ అవి సాఫీగా నడిచే పరిస్థితి కన్పించడం లేదు.

తెలంగాణ కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, తెలంగాణపై ఒక స్పష్టమైన నిర్ణయం లేనిదే ప్రజలకు ముఖం చూపించలేమని ప్రకటించి, ఢిల్లీలో మకాం పెట్టారు. సమావేశాలకు మేము రాబోమని చెప్తున్నారు. తెలంగాణ మీద నిర్ణయం కావాలని కోరుతూ టిఆర్ఎస్ గోల చేస్తున్నది. సభను స్థంభింప చేస్తున్నది. ఎమ్మార్ అక్రమాలు, రహేజా దోపిడీ, జలయజ్ఞం పాపాల మీద తెలుగుదేశం ప్రభుత్వాన్ని నిలదీస్తున్నది. వీటన్నిటికంటే సమస్యాత్మకమైన అంశం – విద్యార్థుల ఫీజులు, ఉపకార వేతనాల బాకీల చెల్లింపుపై సుప్రీం కోర్టు వేసిన మొట్టికాయ. ఫీజులు కట్టాలంటే డబ్బు లేదు. కట్టకుంటే కాలేజీ యాజమాన్యాలు ఒప్పుకోవడం లేదు. ఈ అంశంలో ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడానికి వైఎస్ జగన్ వారం రోజుల సత్యాగ్రహం ప్రారంభిస్తున్నాడు. ఆయన హైదరాబాదులో కూర్చుంటే, రాష్ట్రమంతటి నుంచి జన ప్రవాహం తరలి వస్తుంది. శాసనసభ జరిగే సమయంలో అదెంత చీకాకో చెప్పనవసరం లేదు. మరొకప్రక్క రాష్ట్రం ఆర్థికంగా దివాలా తీస్తున్నది. నెలవారీ జీతభత్యాలకే కటకటగా వుంది. పన్నుల దండకం ఎంత నిక్కచ్చిగా జరిగినా ఖజానాలో చిల్లి గవ్వలు కూడా మిగలడం లేదు. ఈ పరిస్థితిలో సహాయ నిరాకరణ ఉద్యమం ప్రారంభించాడు కెసిఆర్. తెలంగాణ జిల్లాలలో ఎవరూ పన్నులు కట్టవద్దని చెప్తున్నాడు. తెలంగాణ ఎన్జీఓల సంఘం ఆయనకు మద్దతు పలుకుతున్నది. ప్రభుత్వ పన్నుల రాబడిలో 60శాతం పైగా తెలంగాణ జిల్లాల నుంచే వస్తున్నది. హైదరాబాద్ నగరానిది అందులో అగ్రభాగం. ఒక్క వారం రోజుల పాటు పన్నుల వసూలు ఆగిపోయినా ప్రభుత్వం దివాలా తీయడం ఖాయం. అదే జరిగితే రాజ్యాంగ సంక్షోభం పేరిట ప్రభుత్వ మనుగడకే ప్రమాదం ఏర్పడుతుంది.

ఇన్ని సమస్యలను ఎదుర్కొనే సత్తా, సామర్థ్యం, చేవ, రాజకీయ చాణక్యం కిరణ్‌కుమార్‌రెడ్డిలో లేవు. ఆయనకు పరిపాలన కొత్త. అన్నీ తప్పటడుగులు, తప్పటడుగులు. దానితో ప్రభుత్వం నిద్రాణమై పోతున్నది. పాలన స్తంభించి పోతున్నది.

దీనితో కిరణ్ ప్రభుత్వం వుంటుందా వూడుతుందా అన్న సందేహం పెద్ద చర్చగా నడుస్తున్నది. సాధారణ ప్రజలే కాదు, సీనియర్ ఐఎఎస్ అధికారులు సైతం ఈ చర్చలో పాలుపంచుకోవడం విశేషం. ఎవరికీ ప్రభుత్వం మీద నమ్మకం లేని స్థితిలో పాలన సాగించడం కిరణ్‌కుమార్‌రెడ్డి చేసుకొన్న దురదృష్టం. దానితో ఐఎఎస్ అధికారులు మంత్రులకు సహకరించడం లేదు. మంత్రులు కూడా ఎప్పుడు వూడిపోతుందో తెలియని పదవి అనే ఉద్దేశంతో దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలని చూస్తున్నారు. అందినంత జవురుకొనే పనిలో పడ్డారు. డబ్బు ముట్ట చెప్పే ఫైళ్లను మాత్రమే పట్టుబట్టి తెప్పించుకొంటున్నారు. వాటి మీదనే కసరత్తు చేస్తున్నారు.

సుడిగాలిలో చిక్కిన నావ కడవరకు నడవడం కష్టమన్నది సహజం. కిరణ్ ప్రభుత్వం పరిస్థితి అదిగానే వుందిప్పుడు. అధిష్టానానికి కూడా ఆయన మీద పూర్తిగా నమ్మకం నశించినట్లు చెప్తున్నారు. చిరంజీవి చేరికతో తాత్కాలిక ఉపశమనం దొరికినా, ఎంతోకాలం ప్రభుత్వాన్ని నడపడం కిరణ్ వల్ల అయ్యేపని కాదని ఢిల్లీ పెద్దలు భావిస్తున్నారట. అయితే ఇప్పటికిప్పుడు నాలుగో కృష్ణుడిని రంగంలోకి తెచ్చే సాహసం మాత్రం వారు చేయలేరు.

# సాక్షి చిక్కిపోయింది

పంచరంగుల ముస్తాబుతో, చదివే వాడి చెయ్యి బరువెక్కేన్ని పేజీలతో తెలుగు పత్రికా లోకంలో సంచలనం సృష్టించిన సాక్షి దిన పత్రిక వున్నట్లుండి చిక్కిపోయింది. ఏనాటికైనా అగ్రాసనంలో వున్న ఈనాడును అధిగమించాలన్న పట్టుదలతో ఖర్చుకు, నష్టాలకు వెనుకాడకుండా సాక్షి పత్రికను వెలువరిస్తున్నాడు వైఎస్.జగన్. ఈనాడు కంటే మిన్నగా వుండాలనే తలంపుతో ఎక్కువ పేజీలు ప్రచురిస్తున్నారు. అయితే దానివల్ల రోజు రోజుకీ ఆర్థిక నష్టాలు కొండల వలె పేరుక పోవడం తప్ప ఈనాడు పై పైచెయ్యి సాధించే ప్రయత్నం సఫలం కాక పోవడంతో, సాక్షి పేజీల సంఖ్యను బాగా తగ్గించి వేశారు. వార్తా విభాగానికి అదనంగా ఇస్తున్న ఫ్యామిలీ సప్లిమెంట్‌ను మానివేసి, ఆ వ్యాసాలను వార్తా విభాగంలోనే సరిపెడుతున్నారిప్పుడు. దీనివల్ల తెలుగులో ప్రచురితమయ్యే దినపత్రికలన్నిటికంటే అధిక పేజీలు ఇస్తున్న పత్రికగా సాక్షికి వున్న స్థానం చెరిగిపోయింది. ప్రకటనల రాబడి లేకుండా పత్రిక నడపడం నిప్పుతో చెలగాటమాడడంతో సమానం. ప్రకటనల రాబడి రావాలంటే, ఎబిసి అనే సంస్థ ఇచ్చే అత్యధిక సర్కులేషన్ కల్గిన పత్రిక అన్న గుర్తింపు దక్కాలి. గత రెండు దశాబ్దాలుగా ఆ గుర్తింపు ఈనాడుకు వుంది. దాన్ని తనకు సంక్రమింప చేసుకోవడానికి జగన్ చేయని ప్రయత్నం లేదు. కానీ ఆయన ఎత్తులను చిత్తు చేయడంలో రామోజీరావు ఆర్థిక చాణక్యం పై చెయ్యి సాధించింది. ఈ పోరాటంలో సాక్షి పత్రికకు ఒక దశలో రోజుకు ఒకటిన్నర కోటి రూపాయల వరకు నష్టం వచ్చింది. వైఎస్ అధికారంలో వున్నప్పుడు డబ్బు ఒక సమస్య కాదు కాబట్టి, ఎంత ఖర్చయినా భరించారు. ఇప్పుడు ఆ అవకాశం లేదు. ఇంట్లో నుంచి తెచ్చి పెట్టాలి. ఎంతకాలం తెస్తారు? అందువల్లనే ఖర్చులు తగ్గించుకొనే ప్రయత్నంలో పడ్డారు. దాని పరిణామమే – పేజీల తగ్గింపు. చక్కనమ్మ చిక్కినా అందమే అన్నట్లు, పేజీలు తగ్గినా ఈనాడు కంటే మంచి పత్రికగా పేరు తెచ్చుకోవచ్చు. కానీ జగన్‌కు స్వంత రాజకీయ అవసరాలున్నాయి. రాజకీయ శత్రువులున్నారు. దానితో సాక్షిలో ఒకవైపు జగన్ కార్యక్రమాల ప్రచారం, మరొకవైపు శత్రువుల మీద దుమ్మెత్తిపోసే కథనాలు మాత్రమే నిండి పోతున్నాయి. సగటు పాఠకుడు చదవడానికి విషయం వుండడం లేదు. పత్రిక ప్రాచుర్యం కావాలంటే, స్వంత గోల పక్కన పెట్టాలి. కానీ తనకు రాజకీయమే మొదటి ప్రాధాన్యత అనుకొన్న జగన్ పత్రికను పక్కన పెట్టాలనే నిర్ణయానికి వచ్చినట్లున్నాడు

## జనవాణి

2వ పేజీ కొరవ

మందికి పైగా మైనార్టీలు రాజీవ్ విద్యామిషన్ పత్రికల్లో ఇచ్చిన ప్రకటన ఆధారంగా ఉపాధ్యాయ పోస్టులకు దరఖాస్తు చేసి వున్నా నియామక ప్రక్రియ చేపట్టేవారు లేకపోవడం విచారకరం.

షేక్. అన్వర్‌బాషా నెల్లూరు

### మభ్య పెడుతున్నారు

ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన రచ్చబండ కార్యక్రమం మోసపూరిత మైనది. ప్రజలను మభ్య పెట్టే కార్యక్రమం. భారత రాజ్యాంగ నిర్మాత బి.ఆర్. అంబేద్కర్ సామాన్య ప్రజలు, దళితుల అభ్యున్నతి కోసం రాజ్యాంగంలో అనేక హక్కులు కల్పించారు. కాని ప్రయోజనం శూన్యం. స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలు దాటినా నేటికి ఇల్లు, భూమిలేని వారు ఎందరో వున్నారు. వ్యవసాయం చేయలేక రైతులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. వేలాది ఎకరాల ప్రభుత్వ భూములను భూస్వాములు, కబ్జాదారులు విచ్చలవిడిగా ఆక్రమించుకొంటున్నా అడిగే దిక్కు లేదు.

గున్నం నరసింహారావు నెల్లూరు



## స్పీకర్ పదవి ఖాళీ

16వ పేజీ కొరవ

ఇక్కడొక చతురోక్తి విన్పడుతున్నది. ముఖ్యమంత్రిత్వం ఎటూ తుమ్మితే వూడే ముక్కు కాబట్టి, అది చేజారగానే మళ్లీ పాత పదవిలోకి రావాలని కిరణ్‌కుమార్‌రెడ్డి స్పీకర్ పదవి ఖాళీ పెట్టారని శాసన సభ లాబీలలో చలోక్తులు విసురుతున్నారు ఎమ్మెల్యేలు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

కుమార్‌రెడ్డి కన్పించడం లేదని, ఆయన కిడ్నాప్ అయినట్లు తమకు అనుమానంగా వుందంటూ కోవూరు పోలీస్‌స్టేషన్‌లో కంప్లయింట్ ఇవ్వడం కలకలం రేపింది. రైతుల సమస్యలపై స్పందించక పోవడం, గిట్టుబాటు ధరపై మద్దతు కోరినా పట్టించుకోకపోవడంతో రైతులు ఆయనపై తమ నిరసనను వినూత్న రీతిలో ఇలా వ్యక్తపరిచారు. తమ శాసన సభ్యుడిని వెదికి పెట్టాలని వారు పోలీసులను కోరడం చర్చనీయాంశమయ్యింది. అసలే ఇటీవల కొంతకాలంగా పలు సమస్యలను ఎదుర్కొంటున్న ప్రసన్నకు రైతులు భలే షాక్ ఇచ్చారని కోవూరులో చర్చించుకొంటున్నారు.

### ఆనం సోదరుల దిష్టిబొమ్మ దగ్ధం

విఆర్ కళాశాలలో పెద్ద ఎత్తున జరుగుతున్న అవినీతి అక్రమాలపై సిబిఐ విచారణ జరిపించాలంటూ ఎబివిపి విద్యార్థులు విఆర్ కళాశాల కూడలి వద్ద 12వ తేది రాస్తారోకో నిర్వహించారు. ఈ సందర్భంగా విద్యార్థి సంఘం నేతలు ఆనం సోదరులపై విరుచుకపడ్డారు. అనంతరం వివేకానందరెడ్డి, మంత్రి రామనారాయణరెడ్డిల దిష్టి బొమ్మలు దగ్ధం చేశారు.

### మద్దతు ధరపై బోర్డు

జిల్లాలో ధాన్యం కొనుగోలు, రైతుల మద్దతు ధరకు సంబంధించి జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ బోర్డులను ఏర్పాటు చేయించారు. 'ఎ' గ్రేడ్ ధాన్యాన్ని క్వింటాల్ 1030 రూపాయలకు, సాధారణ రకాన్ని క్వింటాల్ 1000 రూపాయలకు మిల్లర్లు కొనుగోలు చేయాలని బోర్డులో రాయించారు. అంతే కాకుండా దళారులంతా పౌరసరఫరాల శాఖ ద్వారా లైసెన్సులు పొందాలని ఆదేశించారు. లైసెన్సులు లేకుండా ధాన్యం కొనుగోళ్లు, అమ్మకాలు చేయరాదని దళారులకు స్పష్టమైన ఆదేశాలు జారీ చేశారు.

### నగరంలో ఐటి దాడులు

నగరంలోని పలు విద్యాసంస్థలు, వైద్యులు, వ్యాపారుల ఇళ్లపై ఆదాయ పన్ను(ఐటి) శాఖ అధికారులు ఈ వారంలో దాడులు చేయడం కలకలం రేపింది. విద్యార్థుల వద్ద నుంచి అధిక మొత్తంలో ఫీజులు వసూలు చేస్తూ పన్ను కట్టకుండా వున్న విద్యా సంస్థల యాజమాన్యాలు, డాక్టర్లు, బంగారు వ్యాపారులు తదితరులపై గత కొంత కాలంగా నిఘా పెట్టిన అధికారులు మూకుమ్మడిగా దాడులు చేయడం సంచలనం కల్గించింది. రామలింగాపురంలోని ఒక డిగ్రీ కాలేజిపై దాడి చేసిన ఐటి అధికారులు వివిధ ఫైళ్లను తీసుకెళ్లినట్లు సమాచారం. ఈ దాడుల సంగతి తెలుసుకొన్న ఇతర వైద్యులు, వ్యాపారస్తులు తమ ఇళ్లకు, ఆస్పత్రులకు తాళం వేసుకొని పోయారు.

### సంగీతకారుడు భద్రాచలం మృతి

ప్రఖ్యాత సంగీతకారుడు, పలువురు సినీ సంగీత దర్శకుల వద్ద వాయిద్యకారుడిగా పనిచేసిన భద్రాచలం ఇటీవల మృతి చెందాడు. గోదావరి జిల్లాకు చెందిన వాడైనప్పటికీ 50 ఏళ్లుగా నెల్లూరులో స్థిరపడ్డాడు. ముఖ్యంగా మోర్సింగ్ అనే వాయిద్యాన్ని పలికించడంలో దిట్టగా పేరుపడ్డాడు. కె.వి.మహదేవన్, ఇళయరాజా తదితర దిగ్గజాల వద్ద చాలాకాలం పాటు పలు సినిమాలకు పనిచేసి వున్నాడు.

# జడ్పీ ఛైర్మన్‌పై అవినీతి ఆరోపణలు అర్థరహితం!

జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిపై అవినీతి ఆరోపణలు చేయడం అర్థరహితమని అఖిలపక్ష సమావేశం అభిప్రాయపడింది. జిల్లా పరిషత్ ఆధ్వర్యంలో పనిచేసే పంచాయితీ రాజ్, మండల పరిషత్ కార్యాలయాలపై ఇటీవల అవినీతి నిరోధకశాఖ అధికారులు దాడులు చేసిన సంగతి తెలిసిందే. రాజకీయ సమీకరణల నేపథ్యంలో ఎసిబి దాడులు జరిగాయన్న విమర్శలు వున్నాయి. వరుస దాడులు చేయడంతో అధికారులు సైతం ఆందోళన చెందారు. జిల్లా పరిషత్ నూతన భవన నిర్మాణం పూర్తి కాకుండా చేయాలన్న నెపంతోనే అధికారపార్టీకి చెందిన నేతలు ప్రయత్నాలు చేస్తున్నారు.

జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తనపై వచ్చిన అవినీతి ఆరోపణలు కేవలం కల్పితమేనంటూ ఈ నెల 14వ తేదిన అన్ని రాజకీయ పార్టీల నేతలతో జడ్పీ సమావేశ మందిరంలో సమావేశం ఏర్పాటు చేశారు. నిధులు విడుదల, మంజూరు చేసిన పనుల పరిశీలన నిమిత్తం ఇందుకు సంబంధించిన ఫైళ్లను సమావేశం ముందుంచడం జరిగింది. మండల పరిషత్ ఆధ్వర్యంలో చేపట్టే పనులకు మండల సర్వసభ్య సమావేశంలో తీర్మానం చేసిన తర్వాతనే జిల్లా కలెక్టర్ ఆమోదం కోసం పంపుతారు. ఇందులో జిల్లా పరిషత్ ఛైర్మన్‌కు ఎటువంటి బాధ్యత వుండదని ఛైర్మన్ వెల్లడించారు.

సమావేశంలో పాల్గొన్న నేతలందరు కూడా రాజకీయ కక్షల కారణంగా వచ్చిన ఆరోపణలే తప్ప ఇందులో వాస్తవం లేదని అభిప్రాయపడ్డారు. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం అమలు చేసే అధికారులు అవినీతి అక్రమాలకు పాల్పడితే వారిపై చర్యలు తీసుకోవాలేతప్ప సంబంధంలేని వారిని ఇందుకు బాధ్యులుగా ప్రకటించడం సమంజసంగా లేదన్నారు. పంచాయితీరాజ్ సూపరింటెండెంట్ ఇంజినీర్ తన పరిధికి మించి వ్యవహరించడాన్ని అందరు తప్పుబట్టారు. అఖిలపక్ష సమావేశంలో పాల్గొన్న నేతలు వెల్లడించిన అభిప్రాయాలను దిగువనిస్తున్నాం.


జడ్పీ సమావేశ మందిరంలో జరిగిన అఖిలపక్ష సమావేశంలో పాల్గొన్న వివిధ పార్టీల నేతలు.

### ఇవి రాజకీయ దాడులు

జిల్లా పరిషత్, మండల పరిషత్‌లపై ఎసిబి దాడులు చేసి రికార్డులు స్వాధీనం చేసుకోవడం వెనుక రాజకీయ కారణాలు వున్నాయి. దాదాపు ఆరు సంవత్సరాల క్రితం ప్రారంభించిన పథకాలకు సంబంధించి నిధులు దుర్వినియోగం జరిగాయని ఇప్పుడు దాడులు చేయడం బాధాకరం. నాలుగున్నరేళ్ల నుంచి జడ్పీ ఛైర్మన్ అనేక కార్యక్రమాలు చేపట్టి జిల్లా ప్రజల ఆదరాభిమానాలు పొందారు. అటువంటి వ్యక్తిపై ఆరోపణలు చేయడంతోపాటు అధికారులను భయభ్రాంతులకు గురి చేయడం అర్థరహితం.

**– జక్కా వెంకయ్య,** *సిపిఎం కేంద్ర కమిటీ సభ్యులు.*

### బురదజల్లే ప్రయత్నం

జిల్లా పరిషత్ చరిత్రలో ఎన్నడూలేని విధంగా ఆదాయం సమకూర్చి పెట్టిన ఘనత జడ్పీఛైర్మన్‌కు దక్కుతుంది. ఈ నేపథ్యంలో 200 కోట్ల రూపాయల మేర నిధులు దుర్వినియోగం చేశాడని ఆరోపణలు ఆశ్చర్యం కలిగించే పరిణామం. మొత్తం బడ్జెట్ అంత లేదని రికార్డులతో సహా చూపించారని అలాంటప్పుడు నిధులు ఎక్కడ నుంచి వస్తాయన్నది ఆరోపణలు చేసిన వారే వెల్లడించాలి. జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశంలో తీర్మానం ప్రవేశపెట్టి ప్రభుత్వానికి పంపి ఆమోదం పొందిన తర్వాతనే నిధులు కేటాయింపు జరిగినట్లు ఆధారాలు వున్నాయి.

**– చేజర్ల వెంకటేశ్వరరెడ్డి,** *టిడిపి రాష్ట్ర కార్యదర్శి.*

### అధికారులను బలి చేయరాదు

జిల్లా పరిషత్ పాలకవర్గంలో తలెత్తిన రాజకీయాల నేపథ్యంలోనే అవినీతి, ఆరోపణలొస్తున్నాయి. ఇందుకు కొందరు అధికారులను బలిచేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అవినీతి, అక్రమాలకు పాల్పడిన అధికారులు, ఇతర సిబ్బందిపై చర్యలు తీసుకొనే అధికారం జిల్లా కలెక్టర్‌కే వుంటుంది. జడ్పీ నూతన భవనం ప్రారంభోత్సవం జరగనీయకుండా ఆటంకాలు కల్పించడం సిగ్గు చేటు. జడ్పీ పరిపాలన రాజకీయాలకు అతీతంగా జరుగుతున్న సమయంలో అధికార బలం ప్రయోగించి ఆరోపణలు చేయడం సమంజసం కాదు.

**– కె.ఆంజనేయరెడ్డి,** *బిజెపి జిల్లా అధ్యక్షుడు.*

### విచారణకు సిద్ధం

జిల్లా పరిషత్‌లో నిధులు దుర్వినియోగం జరిగాయని వచ్చిన ఆరోపణలపై ఏ విచారణకైనా సిద్ధంగా వున్నాను. జడ్పీ బడ్జెట్ ఎంతో తెలుసుకోకుండా 200 కోట్ల రూపాయలు దుర్వినియోగం జరిగాయని ఆరోపణలు చేయడం మంచి పద్ధతి కాదు. నాలుగున్నరేళ్ల పదవీకాలంలో ఏనాడు కూడా ఆరోపణలు ఎదుర్కోలేదు. జిల్లాలోని 46 మండలాలకు సభ్యుల ప్రతిపాదన మేరకే నిధులు కేటాయింపు జరిగింది. రాజకీయంగా ఎదుర్కోవాల్సిన వారు అధికారులను అడ్డం పెట్టుకొని కక్ష సాధింపుకు పాల్పడుతున్నారు.

**– కాకాణి గోవర్ధన్‌రెడ్డి,** *జడ్పీ ఛైర్మన్.*

# నెల్లూరు సమగ్ర చరిత్ర తయారయ్యేదెన్నడు?

**చాలా** కాలంగా నా మనసును వేధిస్తున్న అంశం నెల్లూరుకు సమగ్రమైన చరిత్ర, సాహిత్య గ్రంథం లేదన్నది!

క్రీ.శ ఒకటవ శతాబ్ది నుంచి నెల్లూరు శాసన సంపుటాల్ని పరిశీలిస్తే జిల్లాకు అపారమైన చరిత్ర, సాహిత్య, పురావస్తు చరిత్ర వుందన్న విషయం అర్థమవుతుంది. చోళ, పల్లవ, శాతవాహన, కాకతీయ, విజయనగర, బ్రిటీషు, నవాబుల కాలంలో ఎన్నో చారిత్రక సుసంపన్నమైన కట్టడాలు, కోటలు, దేవాలయాలు జిల్లాలో నిర్మించబడ్డాయి. ఎంతో సాహిత్య సృష్టి జరిగింది. దాదాపు నూట ఇరవై ఎనిమిది మంది కవులు, కవయిత్రులు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

సాహిత్యంలో బాస్వెల్ దొర, నెల్లూరు మాన్యువల్, జిల్లా గెజిట్లు, కొందరు నెల్లూరు గొప్పవారు (వేదం వేంకటరాయశాస్త్రి రచన) వంటి ప్రచురణలు వున్నాయి. నెల్లూరుజిల్లా పరిషత్ వారు నల్లపురెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి(కోట) పరిషత్ ఛైర్మన్‌గా వున్నప్పుడు వేసిన సావనీర్, వేంకటేశ్వరరావు ఆంగ్లంలో అనేక రచయితల చేత రాయించి క్రోడీకరించిన నెల్లూరు చరిత్ర గ్రంథం వున్నప్పటికీ ఇవేవీ కూడా సమగ్రమైన చరిత్రను ప్రస్ఫుటించవు. సాహిత్యం విషయంలో వేదం వేంకటరాయశాస్త్రి, నేలటూరి వేంకట రమణయ్య తదితరులు చాలా కృషిచేసి అనేక తాళపత్ర గ్రంథాల్ని సేకరించి పరిష్కరించారు.

చరిత్ర విషయంలో డాక్టర్ నేలటూరి, డాక్టర్ రాయప్రోలు, డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మ, డాక్టర్ సి.వి.రామచంద్రరావు, డాక్టర్ ఓరుగంటి రామచంద్రయ్య వంటి దిగ్గజాలు భారతదేశ చరిత్రకు చేసిన సేవతో పోల్చుకుంటే నెల్లూరు చరిత్రకు చేసింది చాలా తక్కువ. విచారకరమైన విషయం ఏమిటంటే సంపూర్ణమైన నెల్లూరు చరిత్రకు అవసరమైన ప్రాచీన పుస్తకాలు, నెల్లూరు జిల్లా శాసనాలు అందుబాటులో వున్నప్పటికీ తమ స్వంత గడ్డ చరిత్రలో విషయంలో చూపిన చొరవ చాలా తక్కువే. కొందరు ప్రాచీన పుస్తకాల నుంచి నెల్లూరు చరిత్ర పేరుతో కొన్ని చిన్న పుస్తకాలు ప్రచురించినప్పటికీ అవి సేకరణలను యథాతథంగా ప్రచురించిన పుస్తకాలేగానీ అంశాన్ని, విషయాన్ని విశ్లేషించి స్వంత స్వతంత్రమైన అభిప్రాయాలను క్రోడీకరించిన పుస్తకాలు కావు. అవి రెఫరెన్సుగా పనికివస్తాయే తప్ప విషయ నిర్ధారణ గ్రంథాలుగా పనికిరావు.

నెల్లూరు జిల్లా సాహిత్య, చరిత్ర సమగ్రత విషయంలో పాటించవలసిన అంశాలు కొన్ని వున్నాయి. సాహిత్యంలో పరిష్కరించవలసిన తాళపత్ర ప్రతులు తంజావూరు సరస్వతి గ్రంథాలయంలోనూ, వేటపాళెం బాండాగారంలోనూ చాలా వున్నాయి. వెంకటగిరి రాజాల వద్ద పాతిక సంవత్సరాల క్రితం కొన్ని ప్రతులు వుండేవి. అవి ఇప్పుడు ఉన్నాయో లేదో తెలీదు. వీటన్నింటినీ పరిష్కరించి ప్రచురించాలి. నెల్లూరీయులైన మొల్ల, శ్రీనాధుడు కాల, స్థల నిర్ణయాలు ఇంతవరకూ జరగలేదు. ఈ విషయానికి ఖచ్చితమైన నిర్ధారణలు చేయవలసి వుంది.

**నెల్లూరు చరిత్ర రచయితల గురించి...**

నెల్లూరుజిల్లా వారిలో మొట్టమొదట చెప్పుకోవలసిన వారు నేలటూరు వేంకట రమణయ్య. ఈయన 1873లో నెల్లూరు జిల్లాలో జన్మించారు. విజయనగర చరిత్రపై విశేష, అశేషంగా కృషి చేశారు. ఇక్కడ చెప్పుకోవలసిన విషయం ఏమిటంటే వేంకట రమణయ్య రీడర్‌గా రిటైరు అయితే ఈయన శిష్యులు మాత్రం ప్రొఫెసర్లుగా రిటైరయ్యారు. ఈయన చరిత్రనేగాక సాహిత్య విషయంలోనూ ఎంతో కృషి చేశారు. తిక్కన నిర్వచనోత్తర రామాయణాన్ని, అతని శిష్యుడు జక్కన 'దశకుమార చరిత్ర'నూ పరిష్కరించారు.

**పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**

డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం నెల్లూరీయులే. నాగార్జున యూనివర్శిటీలో పనిచేశారు. నాగార్జున కొండ త్రవ్వకాలను పర్యవేక్షించారు. ఒరిస్సా గజపతులపై పరిశోధించి పట్టా పొందారు. డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మ నెల్లూరు వారే. వారు పురావస్తు శాఖ డైరక్టరుగా రిటైరు అయ్యారు. 'గుడిమల్లం' శాతవాహన కాలం నాటి ఆలయం పరుశురామేశ్వరాలయం, అనేక చరిత్ర స్థల త్రవ్వకాలలో పాల్గొని వాటిపై విస్తృతమైన వ్యాసాలు రాశారు. డాక్టర్ ఓరుగంటి రామచంద్రయ్య నెల్లూరీయులే! ఆంధ్ర యూనివర్శిటీలో పనిచేశారు. శాతవాహనుల చరిత్రపై డాక్టరేట్ పొందారు. డాక్టర్ సి.వి.రామచంద్రరావు నెల్లూరు వారే. అనేక చారిత్రకాంశాల గ్రంథాలకు సంపాదకులుగా, పరిష్కర్తలుగా పనిచేశారు. ఇంకా ఎందరో వున్నారు. వై.గోపాలరెడ్డి, డి.సుబ్రహ్మణ్యరెడ్డి, కె.కృష్ణమూర్తి చాలా చారిత్రకాంశాలపై వ్యాసాలు రాశారు.

ఇందరిని పేర్కొని ఎస్.ఎస్.కృష్ణమూర్తి గారిని పేర్కొనకపోవడం తప్పిదమే అవుతుంది. ఆయన మంచి చారిత్రక విశ్లేషకులు. చరిత్ర రచనలో ఆయన చాలా కృషి చేశారు. వారు నేలటూరు వేంకట రమణయ్యతో పోల్చదగినవారు. ఇంకా ఎందరో చరిత్ర రచయితలు ఈ జిల్లావారు దేశంలో ఎక్కడెక్కడో స్థిరపడ్డారు. అందరూ కలసి నెల్లూరు చరిత్రపై దృష్టిసారిస్తారనీ ఆదిమ మానవుల నుంచి నవాబుల యుగం వరకూ చరిత్రను, ఆంధ్ర శాతవాహనుల నుంచి బ్రిటీషు పరిపాలన వరకూ వెలువడిన నెల్లూరు సాహిత్యాన్ని కలిపి 'నెల్లూరు సమగ్ర చరిత్ర' పుస్తకాన్ని తెస్తారని ఆశిస్తున్నాను.

# స్పీకర్ పదవి ఖాళీ

స్పీకర్ పదవిని ఖాళీగా పెట్టి బడ్జెట్ సమావేశాలు నడప బోతున్నది కాంగ్రెస్ పార్టీ. కిరణ్‌కుమార్‌రెడ్డి ముఖ్యమంత్రి కావడంతో ఖాళీ అయిన స్థానం అది. కాంగ్రెస్, చిరంజీవి కలిస్తే నమ్మకమైన మెజార్టీ వుంది కాబట్టి, కొత్త స్పీకర్‌ను ఎన్నిక చేయడం లాంఛనప్రాయం మాత్రమే. అయితే ఎందువల్లనో అధిష్టానం ఈ విషయాన్ని పట్టించుకోలేదు. ముఖ్యమంత్రి ఒకటికి రెండుసార్లు అహ్మద్ పటేల్ వద్ద ఈ అంశాన్ని ప్రస్తావించి, స్పీకర్‌గా ఎవరిని పెడతామని అడిగితే, ఆ సంగతి మేము చూసుకొంటామని నిక్కచ్చిగా చెప్పాడట. దానితో స్పీకర్ లేకుండానే శాసనసభ సమావేశాలు పిలవక తప్పలేదు.

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.